

# పగటి వెన్నెల

డా॥ సి. నారాయణరెడ్డి

సినీ గీతాల సంకలనం





# పగలే వెన్నెల

సాహితీమర్యాదలను సంతరించుకున్న
తెలుగు సినీగీతాల సంకలనం

డా. సి. నారాయణరెడ్డి

ప్రచురణ



రిజిస్టర్డు నెం: 1/64

యువభారతి
సాహితీ సాంస్కృతిక సంస్థ
5 కింగ్స్‌వే, సికిందరాబాదు-3



# యువభారతి పరిచయము

మనిషిలో అంతర్లీనంగా, నిక్షిప్తంగా ఉన్న ప్రతిభాపరిమళాలు పరివ్యాప్తం కాగల్గినప్పుడే అతని సృజనాత్మక శక్తికి సార్థక్యం చేకూరుతుంది. సమాజంలో సౌందర్యం, సౌజన్యం పెంపొందడానికి అనువైన వాతావరణం ఏర్పడుతుంది. పరస్పరావగాహనం కలుగుతుంది. నిర్మాణాత్మక దృక్పథాలకు ప్రాచుర్యం లభిస్తుంది. సమైక్యభావాలు కుదురుకుంటాయి.

యువభారతి గడచిన పన్నెండేళ్ళుగా సమాజంలో సామరస్యాన్ని పెంపొందించేందుకు సాహిత్యం కంటే ఇతరమైన సాత్విక సాధనం లేదనే విశ్వాసంతో ఇతోధిక కార్యక్రమాలను రూపొందించి కృషి చేస్తున్నది. సాధ్యమైనంత తక్కువ వెలకు వీలైనంత ఎక్కువ మందికి ఉత్తమ సాహిత్యాన్ని అందిస్తే సాహిత్యంపట్ల ప్రజానీకానికి అనురక్తి పెరుగుతుందనే నమ్మకంతో ప్రచురణ కార్యక్రమాన్ని చేపట్టింది. ఇంతవరకు 48 ప్రచురణలను ప్రచురించి రెండు లక్షల యాభై వేలకు పైగా ప్రతులను సాధ్యమైనంత తక్కువ వెలకు పాఠకులకు అందించడానికి పూనుకొంది.

యువభారతి సాహితీమిత్ర పథకంలో దాదాపు 4,100 మందికి పైగా సాహితీమిత్రులు చేరారు. రానున్న ఉగాది నాటికి ఈ సంఖ్య 10 వేలకు చేరుకోవాలన్న మా లక్ష్య సాధనలో తోడ్పడండి. యువభారతి శాశ్వత జీవిత సభ్యత్వ పథకాలలో ఐదువందల మందికి పైగా భారతీ మిత్రులుగా, యాభై మంది భారతీభూషణులుగా చేరారు. ఏ ఒక్క పథకంలోనైనా సభ్యులుగాచేరి మా "నందిని" మాసపత్రికను ఉచితంగాపొందే అవకాశం కల్పించుకోవలసిందిగా సహృదయులకు విజ్ఞప్తి. "నందిని"లో యువభారతి కార్యకలాపాల వివరాలే కాకుండా సాహిత్యానికి సంబంధించిన అనేకాంశాలుంటాయి.

మా తపస్సు ఫలించి తెలుగుదేశంలో అధ్యయన శీలతా సౌజన్యం పెంపొందాలని ఆకాంక్షిస్తున్నాం.

ఇరివెంటి కృష్ణమూర్తి
అధ్యక్షుడు



# మా మాట

చిత్రసాహితి ఒక వినూత్న సాహిత్య ప్రక్రియ. సాహిత్యం విరజిమ్ము తున్న భావాలు ఎలా ఉన్నా వాటిని చిత్రీకరింప వలసి వచ్చినపుడు రచయిత, నిర్మాత, దర్శకుడు, సంగీత దర్శకుడు విలక్షణమైన కోణాలతో పరిశీలిస్తారు. ఈ పరిశీలనం వల్ల రూపుదిద్దుకునే సాహిత్యం ఊహాకందని విలక్షణతను సమ కూర్చు కుంటుంది. ప్రాచీన కవుల పద్యాలను, గేయాలను, కీర్తనలను, జావళు లను వెండితెర కెక్కించినపుడు అవి ప్రేక్షకుల మనస్సులను చూరగొనడానికి కారణం ఇదే.

వాడుకలో ఉండే పదాలూ, పదబంధాలూ, లోకోక్తులూ చిత్రసాహితీ నిర్మాణానికి జీవగర్రలు. అందరికీ అందుబాటులో ఉండేటట్లు, చిత్రకథా వాతా వరణానికి సరిపోయేటట్లు సాహితీ మర్యాదలను సంతరించుకునేటట్లు వ్రాయ గల్గడం అందరికీ సాధ్యం కాని పని. కవిత్వాన్నీ, ప్రజల నాడినీ అర్థం చేసు కున్నవాడే చిత్రసాహితికి న్యాయం చేయగలుగుతాడు.

నాటకంలోవలెనే చిత్రసాహితిలోనూ మాటలూ పాటలూ ఉంటాయి. వాద్య సంగీతమూ ఉంటుంది. పాటలలో కొన్ని కథాగతంగా ఉంటాయి. కొన్ని కథా గతంగా ఉంటూనే కవితా విహాయ సాంచలాలను స్పృశిస్తుంటాయి. ఉత్తమ కవి తకు లక్ష్యంగా ఉంటాయి. వెండితెరమీద కవిత్వం తన రూపరేఖలనూ, బహిర్వే షాన్నీ మార్చుకుంటుందేమో కాని చైతన్యవంతమైన తన అంతరాత్మను మాత్రం స్థిరంగా నిలుపుకుంటుంది. భావం రసరూపం దాల్చినపుడు అది దేశం కాలం మనిషి కల్పించిన ఎల్లలను దాటి సర్వమానవాంతస్సుల్లోకి ప్రవహిస్తుంది. ఈ సత్యం చిత్రసాహితికి కూడా వర్తిస్తుంది. ఈ ప్రక్రియా సాధనలో ఉన్నత శిఖరాలధిరోహించిన వారిలో డాక్టరు సి. నారాయణరెడ్డిగారు అగ్రేసరులని చెప్ప డంలో అత్యుక్తిలేదు. కవిత్వంలో సరిక్రొత్త ప్రయోగాలు చేయడమే ఆయన తపస్సు. మాత్రాఛ్ఛందస్సుల్లో రసవత్‌కథా కావ్యాలు సృష్టించిన మనీషి ఆయన. వచన కవితకు వ్యంగ్యస్ఫూర్తిని ప్రసాదించిన విద్వత్కవి ఆయన. ఆధునికాంధ్ర కవిత్వాన్ని తలస్పర్శిగా పరిశీలించి అపూర్వాంశాలను ఆంధ్రావళికి తెల్పిన సహృదయ విమర్శకులు ఆయన. ఆయన సామాన్య సంభాషణాలోనూ కవిత్వం

తొంగిచూస్తుంటుంది. ఏ పలుకైనా కవితను పులిమే శక్తికి ఆయన వ్యక్తిత్వం ఒక ప్రతీక.

శ్రీ రెడ్డిగారు యువభారతి వేదికనుండి ఉపన్యాసమంజరి కార్యక్రమాల్లో బమ్మెర పోతన్నను గూర్చి, జాషువాను గూర్చి విద్వత్సంస్తవనీయమైన ఉపన్యాసాలను ప్రసాదించారు. పోతన్న "మందార మకరందాలనూ" ఖలీల్ జిబ్రాన్ కవితోక్తులను "శిఖరాలూ లోయలు"గా జనావళికి అందించే అవకాశాన్ని యువభారతికి కలిగించారు. ఇప్పుడు సర్వజనాదరణీయమైన చిత్రగీతాలను "పగలే వెన్నెల"గా అందిస్తున్నారు. కవితా సౌరభాలను వినూత్నరీతిలో గుబాళిస్తున్నారు. ఆచార్య సి. నారాయణరెడ్డిగారు మా యువభారతికి గౌరవ సభ్యులు. అప్పుడు మాకీ అవకాశాన్ని కలిగించిన శ్రీ రెడ్డిగారి సాహిత్య ప్రణయానికి మహోదార హృదయానికి మా హార్దికాభివాదములు.

'పగలే వెన్నెల'ను తమ సజీవరేఖా చిత్రాలతో సమలంకరించిన వారు ప్రసిద్ధ చిత్రకారులు, చిత్ర దర్శకులు, శ్రీ బాపు. ఆయనకు యువభారతి సర్వదా కృతజ్ఞతాబద్ధంగా ఉంటుంది. చక్కని కవితను జనసామాన్యంలో ప్రసరింపజేయడానికి తమ చిత్రాలను సాధనంగా ప్రయోగించిన చిత్రదర్శకులకు, చిత్ర నిర్మాతలను సంగీత దర్శకులను మేమీ సందర్భంగా అభినందిస్తున్నాము. మాండలికాల వలయాల నుండి భాషను విడిపించి భాషాపరంగా దేశములను ఏకత్రితం చేస్తున్న చిత్రజగదధినేతలకు మా అభినందనాలు.

కవిత్వం అందరికీ అందాలనే మా సాధనలో 'పగలే వెన్నెల' మరో మజిలీ. కవితాప్రియులు మా ఈ ప్రయత్నాన్ని ప్రోత్సహిస్తారని ఆకాంక్షిస్తున్నాము.

హైదరాబాద్,
21 నవంబరు 1976.

అధ్యక్షుడు
యువభారతి

# వెన్నెల అంగడి - వెండి త్రాసు

ఏఱందే నాకిష్టం. వాటి అలలలో సరిగమలున్నాయని, వాటిలో సహస్ర స్వరాలున్నాయని, అవి మారుతూ వుంటాయని, మధురగానాలు వినిపిస్తూ వుంటాయనీ, ఒక కాశ్మీరకవి వ్రాశాడు. ఆ పాటను కళ్లకు అద్దుకున్నాను.

పాటలలో యేటి అలలలో అద్దాలు పరచి అనేక ప్రతిబింబాలు చూచుకుని సంబరపడ్డాను. నారాయణరెడ్డిగారు 'ఏకవీర లో' రాసిన పాటలో "నీటిలో రాజు నీడచేత నవ్వించారు" — గుండెల్లో మువ్వలు మ్రోగించారు. ఈ పాటను మనస్సుకు అద్దుకున్నాను.

నారాయణరెడ్డిగారి సినిమాపాట "నన్ను దోచుకుందువటే నవ్వుల దొరసాని" అనేది గులేబకావళిలో గుబాళించింది. ఒక్క పాటతో సినిమాలోకం ఆయన్ని గుర్తించింది. ఆ దోచుకొన్న పాట తర్వాత ఆయన కలం రెక్కలు జాచుకొని ఎక్కడపడితే అక్కడ ఆగి పాటలల్లుకొంది. ప్రతి పాటలో పన్నీట జల్లులు కురిపిస్తోంది. అవి సంపాదించిపెట్టిన కీర్తిని హృదయంలో ఒక వెన్నెల గుడారం వేసుకొని దాచుకొంటున్నారు. ఇంకా ఇంకా సంపాదించే శక్తినీ, దాచుకొనే శక్తిని భగవంతుడాయనకు ప్రసాదించాలని ముందుగా ఆకాంక్షిస్తున్నాను. ఆశీర్వదిస్తున్నామ.

రెడ్డిగారి పాటల కలం మూడువేల అంకె ముట్టుకోబోయింది. ముట్టుకొంటుంది. పదివేల దాక పరుగులు తీస్తుంది. ఫిలిం ప్రపంచంలోనూ ఏభాషల్లో ఇన్ని పాటలు వ్రాసినవారు అరుదేమో! అసలు అగ్రతాంబూలం ఈయనదేనేమో! దీనితో ద్యోతకమవుతుంది, రెడ్డిగారి రచనా పటిమ ప్రావీణ్యత, పాండితాగరిమ! ఏరచనలో చూసినా బూరుగుపత్తిలాంటి మెత్తటి పదాలు కనిపిస్తాయి. వీటిలో పరిమళం అపరిమితం. వీటిని వింటుంటే కుంకుమ పువ్వు మాగాణుల మధ్యగల గట్టువెంట గాలిపీల్చుకుంటూ షికారు చేస్తున్నట్లుంటుంది.

పాటకు ప్రాణాలు రెండు ఒకటి వాణి! రెండు బాణి! ఒకదానితో ఒకటి పోటీపడుతూ వుంటాయి. ఒకప్పుడు ఒకటి పైచెయ్యిగా మారి మాధుర్యాన్ని అందచేస్తూ వుంటాయి. రెండూ అన్నచెల్లెళ్లలాగా అన్యోన్యతగా సంచరించాలి. పరస్పర గౌరవాన్ని ప్రసాదించుకోవాలి. అంతేగాని అత్తాకోడళ్ళ సరళి ప్రమాదకరం.

రెడ్డిగారి పాటలలో ఇలాటి ఇబ్బంది లేదు. ఆయన మాటలు సంగీతాన్ని మచ్చిక చేసుకుంటాయి. మాలిమితో కులుకుతూ ముందుకు సాగుతాయి. మాధుర్యాన్ని గుమ్మరిస్తాయి. మనసుల్ని అలరిస్తాయి. రెడ్డిగారి పాటలలో ప్రతి పంక్తి ఒక సరిళిని గుర్తుకు తెస్తూ మరొక స్వరానికి ముడిపెడుతూ వుంటుంది. నారాయణరెడ్డిగారు కనిపించని గాయకుడు. భాషాపరంగా చూస్తే గొప్ప వైతాళికుడు.

ఈ సంపుటిలో పాటలు ఎన్నో ఎందరెందరిస్వాంతాలనో అలరించినాయి. వారి గుండెలలో అల్లుకుపోయినాయి. నేను ఒక్కడనుగా కొన్నిటిని ఏరి బయటపెట్టడం అభిమాని లక్షణం కాదు. పండిన పదిఎకరాల పత్తిచేలో ప్రవేశించి పదివత్తులు మాత్రం చేసి బయటికి రావడం ఎంత భావ్యమో ఈ ఎన్నిక కూడా ఇంతే! అయినా ఉన్న ఈ కొద్ది అవకాశంలో తోటలో పత్తినంతా వత్తులుగా మార్చడం సాధ్యం కాదు. మార్చగలిగితే ఈ గ్రంథంలోని పుటలలో కోటి దివ్వెలు వెలిగించవచ్చు.

పాట కోయిల గూడు, పలుకులు పంచమస్వరాలు. అందువల్లనే అతి మృదువైన, సరళమైన భాష పాటకు కావాలి. ఇలాటి పదసంపద రెడ్డిగారి ఖజానాలో కొల్లలుగా వుంది. భావానికి అనువైన భాషను తెచ్చి ఆకర్షణీయంగా మలచడంలో ఈయన సిద్ధహస్తుడు. అవసరమయితే సమాసాలను సొగసుగా అల్లగలరు. సాధారణ సన్నివేశాలలో వాడుకభాషను ప్రయోగించగలరు. జానపద శైలిలో అనువైన పదజాలం ఈయనకు కరతామలకం. ఈ పాటలలో యమునాతరంగాలు-నందనవనాలు-బృందావనాలు-నవపారిజాతాలు-నవగీతాలు-తరిపి వెన్నెలలు-సైకత వేదికలు-వీణలు-వేణుగానాలు ఇలా ఎన్నెన్నో మధుర రవళులు జాలువారుతూ వుంటాయి. శ్రోతల హృదయాలకు ఒకప్పుడు అమృతాభిషేకం చేస్తూవుంటాయి. ఒకప్పుడు సుమధూళులు వెదజల్లుతూ వుంటాయి. ప్రతి పాటను ఒక ముత్యాలమూటగా సంతరించడం ఈయనలోగల ప్రత్యేకత

సుమారు ఇరవై సంవత్సరాలకింద ఒక ఫిలింపాటల రచయితను మద్రాసులో సత్కరించడం జరిగింది. ఆ సభలో ఒక విద్వత్సమంత్రాలు ప్రసంగిస్తూ "సినిమా పాటలకు కూడా ఉత్తమ సాహిత్యం కొత్తగా చోటు చేసుకొంటూంది." అన్నారు. అది అప్పటికి వచ్చిన సినిమా పాటలు సాహిత్య సింహావలోకనం అయివుండవచ్చుకాని అది పరమ సత్యం మాత్రం కాదు. అప్పటికే కొన్నికలాలు సాహిత్యాన్ని ఉత్తమగతిలో చిత్రించి రాగాలకు భోగాలు కల్పించినాయి. ఇప్పటి సినిమా సాహిత్యంలో భాషకొదువలేదు. ఉత్తమ భాషకు నిషేధం లేదు. సంఘటనలనుబట్టి, సంవిధానాన్ని, బట్టి, భావనాపటిమను బట్టి

ఉత్తమ సాహిత్యం ప్రయోగింపబడుతుంది. అలా ముస్తాబయిన పాటలు శ్రోతల హృదయాలను ముగ్ధుల్ని చేస్తూనేవున్నాయి. రెడ్డిగారి పాటలలో రెండు తరగతులు వున్నాయి. ఉజ్జ్వలమయిన సాహిత్యం రసస్ఫూర్తిని కల్పించే వాడుక భాష ఈ కలంనుండి సరళంగా, సహజంగా, జాలువారుతూ వుంటాయి.

"నాపేరు సెలయేరు- నన్నెవ్వరాపలేరు" వంటి తేలిక పదాలతో భావ శబలతలు కల్పించగలరు "ఆడవే మయూరి - నటనాడవే మయూరి" పాటలో భాషా పటిమ వెల్లార్చుకొనడం జరిగింది. ఆయన ఎప్పుడూ కోరేది భావము. తన పలుకులకెనయగు కులుకు చూపి తన కవితకు సరియగు నటనమాడాలనే భావాలు పండించుకోవడంలో రెడ్డిగారు ఆయన కాయనేసాటి. "పసిడియంచు పైటజార, పయనించే మేఘబాల" - ఇందులో ఎంత కవితా హృదయముంది!

దూరాన ఆకాశ తీరాల
హారాలు వేసేను కిరణాలు"

ఇందులో యెంతటి ప్రకృతి దర్శనముంది? పదాలు వరిచినంత మాత్రాన మంచి పాటలు కాలేవు. కవితాహృదయాన్ని పరిచినప్పుడే పాటలు కోమలగీతాలవుతాయి. ప్రతి మాటకు కవి వెనకనుండి చిటికెవేస్తున్నట్లుంటుంది.

"నీ పేరు తలిచినా చాలు
మదిలో పొంగు శతకోటి యమునాతరంగాలు."

అన్నారీయన - ఇక్కడ కథాసంవిధానంలో పేరెవరిదయినా కావచ్చు. కాని కవిపరంగా తలిస్తే ఆ పేరు గానసరస్వతిదే అవుతుంది. శతకోటి తరంగాలుగా పొంగిన మది కవి పుంగవునిదే అవుతుంది. లరక సత్యాలను, ప్రకృతి ధర్మాలను ముడిపెట్టడంలో ఈయనకు ఈయనేసాటి

"కలవాలం విసిరితే కలకోకిల కూయునా
కొరడా ఝుళిపించితే కుసుమం విరబూయునా"

అనే చరణంలో లోకధర్మం, జీవితధర్మం, కవితాధర్మం ముప్పేటలుగా జతల్లుకొని ముద్దు ముద్దుగా యెగిరి గంతులు వేస్తుంది. ఈ వర్ణనలో కవి హృదయం విప్పిచెప్పడం జరుగుతుంది. అవే బంగారు కుప్పెలుగా జడ చివర మెరుపులు కురిపిస్తాయి

"మల్లెలలారా! మాలికలారా, మౌనముగా ఉన్నారా?
మా కథలే విన్నారా?"

ఈ పాటలో బాహ్య, అంతర ప్రకృతులను ఒకటిచేసి, ముడివేసి, నిలవేసి కథ చెప్పుకొన్న రీతి కనిపిస్తుంది. మానవుడు సమాజజీవి. ప్రకృతి పరమాత్మ స్వరూపం. ప్రకృతిని చూచి దాన్లోగల అనంత శక్తిని తనలోకి తెప్పించుకోవడంకోసం, రప్పించుకోవటంకోసం అతడు తాపత్రయపడుతూ వుంటాడు. కన్ను ప్రకృతిలో అందాన్ని దోచుకోటానికి ప్రయత్నిస్తూవుంటుంది. గుండెలు ప్రకృతిలోగల అనంత శక్తిని అన్వేషించి, క్రొత్త ఊపిరిగా పీల్చు కోటానికి అహరహం ప్రయత్నిస్తూ వుంటాయి. ఇది పవిత్ర బాంధవ ముద్ర. తను ప్రకృతిలో లీనం కాలేక ప్రకృతిని తనలోకి తీసుకోవడం కోసం నరుడు తాపత్రయపడటంలో ఒక సహజ ధర్మం వుంది. ఎందువల్ల? ప్రకృతిలో యెంత సౌందర్యమున్నా, ఆధ్యాత్మిక చింతనవున్నా, సృష్టివైచిత్యచిత్రణవున్న మానవుడు అక్కడ ఆద్యంతాలను ముడిపెట్టలేడు. అవి ముడివడేచోటుఒక్కడే. అవి మానవ హృదయం-అందుకనే అని శక్తుల్ని ఇక్కడ చేర్చుకోటానికి మానవ హృదయం ఉక్కిరి బిక్కిరి అవుతూవుంటుంది. ప్రకృతిని పలకరించి పులకరించడం కూడా రెడ్డిగారికి తెలుసు.

"ఈ నల్లని రాలలో, ఏ కన్నులు దాగెనో

ఈ బండల మాటున, ఏ గుండెలు మ్రోగెనో"

దీనికి జవాబు ఎన్నియుగాల వెనకకోవెళ్లి వెతుక్కోవాలనిపిస్తుంది. అస్థాణువులకు ప్రాణాలున్నాయని పలుకరించగలవని నవ్వులు గిలుకరించ గలవని పూవులు పూయింపగలవని ఆయన గ్రహించి ఈ పాట లిఖించారు. కవి హృదయం ఒక్క కాలానికి కట్టుబడి వుండదు. భూతాన్ని వెతుకుతుంది. వర్తమానాన్ని అనుసరిస్తుంది. భవిషత్తును దర్శిస్తుంది. త్రికాలజ్ఞత మానవ జీవన సరళికి మురళీనాదం వంటిది. ఇలాంటి అన్వేషణ రెడ్డిగారి పాటలలో మాటి మాటికి స్ఫురిస్తూంటుంది. ఎక్కడో ఏ చరణమో ఒక చరణం ప్రకృతి మాతకు ఏటి కోళ్లందిస్తూనే వుంటుంది. ఆయన తాపత్రయపడి,

"ఈ ప్రశ్నకు బదులేదీ!
ఈ సృష్టికి మొదలేదీ!!" అని ప్రశ్నించారొకచోట.

"చల్లని చిరుగాలి
నిన్నొక సంగతి అడగాలి" అంటారొకచోట.

సమాజ జీవనం మీద ఈయనకు ఎంతో జాలి. తలచి తలచి మానవతా భావనలను పాటలలోకి మళ్లిస్తూవుంటారు.

పేదవారి బ్రతుకుదారి
తెలవారని చీకటి
వారుకున్న దేమిటి
ఆరిపోని ఆకలి" అని ఈయన హృదయం

పరితపించింది.

"తాజమహలులో కురిసే వెన్నెల
పూరి గుడిసెపై కురియదా!
బృందావనిలో విరిసే మల్లియ
పేద ముంగిట విరయదా!

అని ఆశావాదిగా మారిపోయారొకచోట.

"చదువురాని వాడవని
దిగులు చెందకు-మనిషి
మదిలోన మమత లేని
చదువు లెందుకూ!"

అని మనసుగల వారందరి మమతగల వారందరి ఎదలపై శ్రీ గంధం పూసారు. ఆంధ్రావని గురించి కూడా అనేక పాటలలో నివాళు లందించారు.

"నాగార్జున గిరి కౌగిలి ఆగి
బీళ్లను బంగారుచేలుగా
మార్చేవు
ఆంధ్రావనికే అన్నపూర్ణవై
కరువును బాపేవు
కరువులు బాపేవు, బ్రతుకులు నిలిపేవు"

అని కృష్ణవేణికి పాటల మణిహారం వేసారు. రెడ్డిగారి పాటలు ఎన్నెన్నో

వున్నాయి. వలచిన రీతులు, గతులు, అనంతం, భావాలు తాకేది, దిశాంతం. హృదయాలకు కల్పించేద ప్రశాంతం.

'మేలుకో కవిరాజా! మేలుకోవయ్యా' అనే 'మహాకవి క్షేత్రయ్య' పాటలో రెడ్డి గారి కలం పాండిత్యాన్ని, ప్రతిభనూ, సంగీత ప్రభావాన్నీ విరబూయించారు..........ఎంతో చక్కటి స్వరాన్ని మేల్కొల్పారు. అష్ట విధ నాయికలు ఒక్కొక్కరే మనముందు, నడిచిపోతున్నట్లుగా చిత్రించారు. పాట కూడా నడిచింది. సంగీతంతో పందెం వేసింది. పాట వింటుండే మందాకిని అలలలో కలువలు ఊగినట్లు, మంచు దుప్పట్లపై కన్నె హంసలు హాయిగా రెక్కలు విసిరినట్లు. పుచ్చ పువ్వు వెన్నెలలో జ్యోత్స్నాభిసారిక మేలిముసుగు జలతారు అంచులు మిల మిలలాడినట్లు నడిచింది పాట - నవభావనతో దివ్యగానంతో.

"అడుగులు రెండైనా నాట్యాలెన్నో
అక్షరాలు కొన్నైనా కావ్యాలెన్నో" అన్నారీయన.

అక్షరాలు కొన్నైనా పాటలు ఎన్నెన్నో అంటాను నేను. అక్షరసంపద అక్షయమైంది. రచయిత సుకృతుడు.

ఈ పాటలకు వెలకట్టడం ఎలా? ఒక్క చిన్నపాట కట్టి ముగిస్తాను.

"వెన్నెల అంగడిలో
వెండి త్రాసులో
కవితలు తూచే
ఓ వ్యాపారీ
ధర ఎంతోయి
రెడ్డి పాటలకు!

—రాపూరు వెంకట సత్యనారాయణరావు



తెలుగు ఎదలో తెలుగుతనం
వెల్లువలా పారాలని
తెలుగింటిలో తెలుగుదీపం
అఖండంగా వెలగాలని
ఈ జాతి నిద్రలేచి
మహోన్నత మానవాదర్శాల వైపు
నిరంతర కృషితో
పయనం కొనసాగించాలనే ధ్యేయంతో
ఉడుతాభక్తిగా యువభారతి కృషి చేస్తున్నది
భాషాభిమానం కలగాలంటే
మాతృభాషా సాహిత్య పఠనమే
ప్రథమ కర్తవ్యం అనే భావం
బలంగా మనసులో నాటుకోవడానికి గాను
వీలైనంత ఎక్కువ మందికి వీలైనంత తక్కువ వెలకు
ఉత్తమసాహిత్యం అందించేందుకు
యువభారతి పూనుకున్నది
ప్రతి తెలుగింటిలో
కనీసం పదయినా తెలుగు పుస్తకాలు ఉండేందుకు
మనందరం ఉద్యమ వేగంతో కృషి చేద్దాం
ఆ పదిమంది పుస్తకాలలో ఏ ఒక్కటిగానైనా
యువభారతి ప్రచురణ ఏ ఒక్కటైనా
ఉండాలనే ధ్యేయంతో కృషి చేద్దాం

# యువభారతి

సాహితీ, సాంస్కృతిక సంస్థ
5, కింగ్స్‌వే, సికిందరాబాదు - 3

# పాటల ముందు మాట

పదిహేనేళ్ళుగా చలన చిత్రవాణి పలికిస్తున్న నా పాటల్లోంచి ఇన్నూట ఇరవై ఐదు ఎన్నుకున్నది యువభారతి.

ఇవి కంటికి కనిపించిన పాటలు. అందువల్ల దృశ్యం దృష్టిలో ఉంచుకోవడం అవశ్యం. ఇవి సంగీతాన్ని పెనవేసుకున్న పాటలు. అందువల్ల రాగ ప్రాబల్యాన్ని విస్మరించడానికి వీల్లేదు. పాత్రల చహరాలనూ, సన్నివేశాల తరహాలనూ బట్టి రూపొందిన పాటలివి. ఇన్ని దృక్కోణాలతో వీటినిచూస్తే కొన్నిటిలో శబ్దానిదే ప్రభుత్వం. కొన్నిటిలో చమత్కారానికే ప్రాముఖ్యం. మరి కొన్నిటిలో అచ్చమైన కవితాత్మకు అభిషేకం.

వీటిని పలికింది నేనైనా, పలికించిన శక్తులు అనేకం. నిర్మాత, దర్శకుడు, స్వరకర్త, గాయనీ గాయకులు, ధ్వనిముద్రాపకుడు, ఛాయా గ్రాహకుడు-ఆపైన ప్రేక్షకులు-ఇందరికి ఈపాటలు ఋణపడివున్నాయి.

ఈ పాటల ఎన్నికలో వైవిధ్యాన్ని దృష్టిలో పెట్టుకున్నారు యువభారతి వారు. లక్షల ప్రేక్షకుల నాల్కలపై నటించిన పాటలతోపాటు, తెరమరుగునా-వాతెరమరుగునా పడివున్న పాటలనుకూడా వీరు తీసుకున్నారు. ఇది యువ భారతి కవితామతికి సూచిక.

ఇది నా సినీగీతాల తొలిసంపుటి. ఈ సంపుటి నా పాటల తీరుతెన్నులన్నిటికీ ప్రాతినిధ్యం వహించే సమగ్ర సంపుటి కాకపోవచ్చు. కాని ఇది ఎన్నో కొన్ని మెరుగులను వతకవితావిదులకు పరిచయంచేసే మంచిప్రయత్నమనే నా విశ్వాసం.

ఈ సంపుటిని ప్రచురిస్తున్న యువభారతికీ, ఆదరించనున్న సహృదయ సంతతికీ కృతజ్ఞుణ్ణి.

హైదరాబాదు.
18-11-76

డా॥ సి. నారాయణరెడ్డి

పగలే వెన్నెల

# అనుక్రమణిక

పాట సంఖ్య

# 1

పల్లవి :

ఆమె : తోటలో నారాజు
తొంగిచూసెను నాడు
నీటిలో ఆరాజు
నీడ నవ్వెను నేడు.

చరణం :

నవ్వులా అవి కావు నవపారిజాతాలు
రవ్వంత సడిలేని రసరమ్యగీతాలు.
ఆరాజు ఈరోజు అరుదెంచునా
అపరంజి కలలన్ని చివురించునా. ॥తోటలో॥

చరణం :

అతడు : చాటుగా పొదరింటి మాటుగా వున్నాను
పాటలాధర రాగభావనలు కన్నాను.
ఎలనాగ నయనాల కమలాలలో దాగి
ఎదలోన కదలే తుమ్మెదపాట విన్నాను
ఆపాట నాలో తీయగ మ్రోగనీ
అనురాగమధుధారయైసాగనీ. ॥తోటలో॥

## 2

పల్లవి : బృందగానం :

గోగులుపూచె గోగులుపూచె
ఓ లచ్చగుమ్మడి
గోగులు దులిపే వారెవరమ్మా
ఓ లచ్చగుమ్మడి.

ఆమె : పొద్దుపొడిచె పొద్దుపొడిచె
ఓ లచ్చగుమ్మడి
పుత్తడి వెలుగులు కొత్తగ మెరిసె
ఓ లచ్చగుమ్మడి.

అతడు : పొద్దుకాదది నీ ముద్దుమోమున
దిద్దిన కుంకుమతిలకమే సుమా
వెలుగులు కావవి నీ పాదాలకు
అలదిన పారాణిజిలుగులే సుమా.

ఆమె : ముంగిటవేసిన ముగ్గులుచూడు
ఓ లచ్చగుమ్మడి
ముత్యాలముగ్గులు చూడు
ఓ లచ్చగుమ్మడి.

అతడు : ముంగిలికాదది నీ అడుగులలో
పొంగిన పాలకడలియే సుమా
ముగ్గులు కావవి నా అంతరంగాన
పూచిన రంగవల్లులే సుమా.

ఆమె : మల్లెలుపూచె మల్లెలుపూచె
ఓ లచ్చగుమ్మడి
వెన్నెలకాచె వెన్నెలకాచె
ఓ లచ్చగుమ్మడి.

అతడు : మల్లెలు కావవి నా మహలక్ష్మి
విరజల్లిన సిరినవ్వులే సుమా
వెన్నెల కాదది వేళతెలిసి ఆ
జాబిలివేసిన పానుపే సుమా.

---

## 3

పల్లవి :

ఎదురుచూచిన కాముని పున్నమి
ఆనాడు కాదు ఈనాడే
ఎదలోని పొదలోన— తు
మ్మెదలు ఝుమ్మని చెలరేగె.

చరణం :

ఊహలతరగల నురగల పైన
ఊర్వశియే ఉదయించెనులే
లలితభావకర్పూరవాటిలో
లకుమ అందెలే రవళించెనులే
ఎన్నడు చూడని వెన్నెల కన్నెలు
కిన్నెరసానులై కులికెనులే
ఎన్నోజన్మల మూగరాగాలు
ఎంకిపాటలై పలికెనులే. ॥ఎదురు॥

చరణం :

ఆ-మేని వంపులలోన ఒక
మెలికనై పోదునా
ఆ-మెత్తని గుండెపైన
ముత్యాలదండనై పోదునా
ఆ-ముద్దుమోముపైన— నేనొక
ముచ్చటనై పోదునా
ఆ-కంటిపాపలోన— నేనొక
పాపనై పోదునా. ॥ఎదురు॥

## 4

పల్లవి :

వస్తాడు నారాజు ఈరోజు-రానే
వస్తాడు నెలరాజు ఈరోజు.
కార్తీక పున్నమి వేళలోన
కలికివెన్నెల కెరటాలపైన-తేలి
వస్తాడు నారాజు ఈరోజు.

చరణం :

వేలతారకల నయనాలతో
నీలాకాశం తిలకించేను
అతని చల్లని అడుగుల సవ్వడి
వీచేగాలి వినిపించేను.
ఆతని పావనపాదధూళికై
అవని అణువణువు కలవరించేను
అతని రాకకై అంతరంగమే
పాలసంద్రమై పరవశించేను ॥వస్తాడు॥

చరణం :

వెన్నెలలెంతగా విరిసినగానీ
చంద్రుణ్ణి విడిపోలేవులే
కెరటాలెంతగా పొంగినగానీ
కడలిని విడిపోలేవులే.
కలసిన ఆత్మల అనుబంధాలు
ఏజన్మకు విడిపోవులే
తనువులు వేరైన- దారులు వేరైన
ఆ బంధాలే నిలిచేనులే ॥వస్తాడు॥

అతడు : నన్ను దోచుకొందువటే
వన్నెలదొరసానీ
ఆమె : కన్నులలో దాచుకొందు
నిన్నే నాస్వామీ.

చరణం :

ఆమె : తరియింతును నీచల్లని
చరణమ్ముల నీడలోన
పూలదండవోలె-కర్పూరకళికవోలె
అతడు : ఎంతటి నెరజాణవొ నా
అంతరంగమందు నీవు
కలకాలము వీడని సంకెలలు వేసినావు ||నన్ను||

చరణం :

ఆమె : నామదియే మందిరమై
నీవే ఒక దేవతవై
వెలసినావు నాలో నే-కలసిపోదు నీలో
అతడు : ఏనాటిదో మనబంధం
ఎరుగరాని అనుబంధం
ఎన్నియుగాలైనా యిది యిగిరిపోని గంధం ||నన్ను||

# 6

పల్లవి :

ఆమె : ఎదురుగా నీవుంటే
ఎన్నెన్ని రాగాలో
చల్లని నీమదిలో
ఏ శ్రావణమేఘాలో.

అతడు : నీవాలుకన్నులలోన
నీలాలరాగాలెన్నో
నీ చిగురుమోవిపైన
సిరికెంపులరాగాలెన్నో.

ఆమె : నిత్యవసంతుడు నీడగవుంటే
చిత్రవర్ణరాగాలెన్నో ॥ఎదురు॥

ఆమె : కమలరమణి విరబూయునులే
అరుణోదయవేళలో
కలువచెలువ తెరతీయునులే
చంద్రోదయవేళలో.

అతడు : వలచిన హృదయం పులకించునులే
చెలిమలపుల జోలలో. ॥ఎదురు॥

# 7

పల్లవి :

ఆమె : ఈనాడు కట్టుకున్న బొమ్మరిల్లు
కావాలి ముందుముందు పొదరిల్లు పొదరిల్లు.

అతడు : ఈనాడు కట్టుకున్న బొమ్మరిల్లు
కావాలి ముందుముందు పొదరిల్లు పొదరిల్లు.

చరణం :

అతడు : ఆశలే తీవెలుగా — ఊసులే పూవులుగా
వలపులే తావులుగా అలరారు ఆ పొదరిల్లు

ఆమె : పగలైనా రేయైనా ఏ ఋతువులోనైనా
కురిపించును తేనెజల్లు — పరువాల ఆ పొదరిల్లు ॥ఈనాడు॥

చరణం :

ఆమె : కళ్ళలో కళ్ళుంచీ — కాలమే కరిగించీ
అనురాగం పండించే — ఆ బ్రతుకే హరివిల్లు

అతడు : నా దేవివి నీవైతే నీ స్వామిని నేనైతే
పచ్చని మన కాపురమే పరిమళాలు వెదజల్లు ॥ఈనాడు॥

పల్లవి : నా మనసే వీణియగా పాడనీ
నీ వలపే వేణువుగా మ్రోగనీ.

చరణం : కాదని ఎంతగ కసిరినా— కడ
కన్నుల కెంపులు కురిసినా— ఏ
నాటికైన నీ రాధనురా! ఒక
నాటికి తీరని గాధనురా। నీ రాధనురా ॥నామనసే॥

చరణం : వెదురుపొదలలో దాగినా। నీ
వేవనిలో తిరుగాడినా। నీ
పదములు నాలో మెదలునురా। నా
హృదయము నిన్నే వెదకునురా ॥నామనసే॥

చరణం : సిరులుకోరి నిను కొలిచితినా ?
మరులుపొంగి నిను వలచితినా ?
ఎన్నో జన్మల అనుబంధం
ఇరువురినీ కలిపినబంధం ॥ ॥నామనసే॥

# 9

పల్లవి :

విరిసేకన్నులలో వేయిబాసలున్నవిలే
అవినాగుండెలలో అల్లరిచేస్తున్నవిలే.

చరణం :

నీకనుపాపలే–వినీలకాంతిదీపాలు
నీచిరునవ్వులే–వెన్నెలల పారిజాతాలు
నీసొగసే నాదైతే–నీసొగసే నాదైతే
కలకలలాడులే వసంతాలు ॥విరిసే॥

చరణం :

ఎదురుగ నువ్వుంటే–ఉదయకాంతులెందుకులే
జతగా నువ్వుంటే–జాబిలి ఇంకెందుకులే
నీవలపే నాదైతే–నీవలపే నాదైతే
ఏ బృందావనాలు ఎందుకులే ॥విరిసే॥

## 10

పల్లవి :

అతడు : కనులముందు నీవుంటే
కవితపొంగిపారదా
తొలిచిగురులచూడగానే
కలకోకిల కూయదా.

చరణం :

అతడు : అలనాటి జనకుని కొలువులో
తొలిసిగ్గుల మేలిముసుగులో
రాముని చూసిన జానకివై — అభి
రాముని వలపుల కానుకవై
వాల్మీకి కావ్యవాటిక వెలసిన
వసంతమూర్తివి నీవే. ||కనుల||

చరణం :

అతడు : అలనాటి సుందరవనములో
ఎలప్రాయము పొంగిన క్షణములో
రాజును గనిన శకుంతలవై — రతి
రాజు భ్రమించిన చంచలవై
కాళిదాసు కల్పనలో మెరిసిన
కమనీయమూర్తివీవే. ||కనుల||

చరణం :

అతడు : అజంతాచిత్రసుందరివై
ఎల్లోరాశిల్పమంజరివై
రామప్పగుడిమోమున విరిసిన
రాగిణివై నాగినివై
అమరశిల్పులకు ఊపిరులూదిన
అమృతమూర్తివి నీవే. ||కనుల||

చెల్లెలికాపురం

## 11

పల్లవి :

అతడు : అలకలు తీరిన కన్నులు ఏమనె ప్రియా

ఆమె : అల్లరిచూపుల పల్లవి పాడెను ప్రియా ॥

చరణం :

ఆమె : కదలే పూలగాలి నా-యెదపై తేలితేలీ
ఏ కథలో తెలుపసాగె-ఏ కలలో పలుకసాగె

అతడు : ఆ తీయని గాథల రాధవు నీవే ప్రియా
నా తీరని వలపుల మాధురి నీవే ప్రియా ॥అలకలు॥

చరణం :

అతడు : మదిలో రాగమాల నవ-మధువై పొంగువేళ
నా తనువే పల్లవించె-అణువణువే పరవశించె

ఆమె : ఆ గానములో నను లీనముకానీ ప్రియా
నీ ప్రాణములో ఒక ప్రాణముకానీ ప్రియా

ఇద్దరు : అలకలుతీరిన కన్నులు ఏమనె ప్రియా
అల్లరిచూపుల పల్లవిపాడెను ప్రియా ॥అలకలు॥

---

మా-నాన్న నిర్దోషి

# 12

పల్లవి: ఈ వీణపైన పలికిన రాగం
నాలోన విరిసిన అనురాగం
మీటితే మోగేది రాగం—ఎద
మాటుగా పెరిగేది అనురాగం.

చరణం : కలిమిలోన మిడిసిపడనిది
లేమిలోన కలతపడనిది
ఇరువురి నడుమ ఎల్లలులేనిది
వలచిన హృదయాల తొలికలయిక ॥ఈవీణ॥

చరణం : కనిపించె ఆతని చిరునవ్వులోన
కవితలకందని మధురభావన
ఆ భావనయే ఆరాధనగా
అతనికి నేనే ఒక కానుక ॥ఈవీణ॥

# 13

పల్లవి :

అతడు : కనులు మాటలాడునని—మనసు పాటపాడునని
కవితలల్లితి ఇన్నాళ్ళూ—అది కనుగొన్నాను యీనాడు

ఆమె : కనులు మాటలాడునని—మనసు పాటపాడునని
కవితలల్లగ విన్నాను—అది కనుగొన్నాను యీనాడు.

చరణం :

అతడు : మెత్తగసాగే మేనితీగ-
మెలికలు తిరిగితె ఒక అందం

ఆమె : ఆ మేనితీగ వలపులపందిట
అల్లుకుంటే ఒక అందం

అతడు : మలయానిలమున, చెలిముంగురుల
మబ్బులూగితే ఒక అందం

ఆమె : ఆముంగురులే చెలికానిమోముపై
ముసురుకుంటే ఒక అందం

అతడు : అదే ముద్దులొలికే అనుబంధం ॥కనులు॥

చరణం :

అతడు : వేచిన కలువ వెన్నెలజల్లుల
విరిసిపోతే మధురానందం

ఆమె : ఆకలువచెలువ నెలరాయనితో
కరిగిపోతే మహదానందం

అతడు : జగములనేలే చంద్రవదనతో
ఎగిసిపోతే దివ్యానందం

ఆమె : ఎగిసి ఎగిసి పులకించిన మనసులు
ఏకమైతే రసానందం—

ఇద్దరు : అదే యుగయుగాల అనుబంధం ॥కనులు॥

# 14

పల్లవి :

మెరిసే మేఘమాలికా
ఉరుములు చాలు చాలిక
చెలితో మాటలాడనీ
వలపే పాటపాడనీ.

చరణం :

కమలాలే నా రమణి
నయనాలై విరిసె
అద్దాలే నా చెలియ
చెక్కిళ్ళై మెరిసె.
ఆ నయనాల కమలాలలోన
నా జిలుగు కలలు చూసుకోనీ
ఆ అద్దాల చెక్కిళ్ళలోన
నా ముద్దులే దాచుకోనీ ॥మెరిసే॥

చరణం :

మధుమాసం చెలిమోవిని
దరహాసం చేసె
తెలి జాబిలి చెలిమోమున
కళలారబోసె
ఆ దరహాస కిరణాలలోన–నను
కలకాలం కరిగిపోనీ
ఆ కళల పండువెన్నెలలోన–నా
వలపులన్ని వెలిగిపోనీ ॥మెరిసే॥

# 15

పల్లవి :

అతడు : కిలకిల నవ్వులు చిలికిన
పలికెను నాలో బంగారువీణ

ఆమె : కరిగిన కలలే నిలిచిన
విరిసెను నాలో మందారమాల.

చరణం :

అతడు : రమ్మని మురళీరవమ్ములు పిలిచె
అణువణువున బృందావని తోచె

ఆమె : తళతళలాడే తరగలపైన
అందీ అందని అందాలు మెరిసె ॥కిల॥

చరణం :

ఆమె : నీవున్న వేరే సింగారములేల ?
నీపాదధూళి సిందూరముకాదా !

అతడు : మమతలు దూసీ మాలలు చేసీ
గళమున నిలిపిన కల్యాణి నీవే ॥కిల॥

చరణం :

అతడు : సీకురులే నన్ను సోకినవేళ
హాయిగ రగిలేను తీయనిజ్వాల

ఆమె : జలజలపారే వలపులలోన
సాగెను జీవనరాగాల నావ ॥కిల॥

# 16

పల్లవి :

అతడు : చిగురులువేసిన కలలన్నీ-సిగలో పూలుగ మారినవి

ఆమె : మనసున పొంగిన అలలన్నీ మమతలతీరం చేరినవి
మమతలతీరం చేరినవి.

చరణం :

ఆమె : సన్నజాజితీగెలాగా నిన్నుచేరుకున్నాను

అతడు : నిండుమనసు పందిరికాగా-నిన్ను అందుకున్నాను
నిన్నే అందుకున్నాను

ఆమె : చిగురులువేసిన కలలన్నీ సిగలో పూలుగ మారినవి

చరణం :

అతడు : దాగలేని రాగాలేవో దాచినావు ఆనాడూ

ఆమె : నా తనువూ అణువణువూ నీదేనీదే యీనాడూ
నీదేనీదే ఏనాడూ-

అతడు : చిగురులువేసిన కలలన్నీ సిగలో పూలుగ మారినవి

చరణం :

ఆమె : నీటిలోని కలువనుకోరి-నింగిదిగిన జాబిలినీవే

అతడు : పరిమళాల తరగలలోనే కరగించిన చెలియవు నీవే
కరగించిన చెలియవు నీవే

అతడు : చిగురులువేసిన కలలన్నీ సిగలో పూలుగ మారినవి

ఆమె : మనసున పొంగిన అలలన్నీ మమతలతీరం చేరినవి
మమతలతీరం చేరినవి !

పల్లవి :

ఆమె : మనసు పాడింది సన్నాయిపాట
కనులు ముకుళించగా
తనువు పులకించగా
గగనమే పూల తలంబ్రాలు కురిపించగా.

చరణం :

అతడు : జగమే కల్యాణవేదికగా
సొగసే మందారమాలికగా
తొలిసిగ్గు చిగురించగా-నా
అలివేణి తలవాల్చి రాగా ॥మనసు॥

చరణం :

ఆమె : చిలికే పన్నీట వెన్నెలలోన
పిలిచే విరజాజి పానుపుపైన
వలపులు పెనవేసుకోగా-నా
వలరాజు ననుచేర రాగా ॥మనసు॥

చరణం :

అతడు : మదిలో దాచిన మమతల తేనెలు
పెదవులపైన కదలాడగా
ఆమె : పెదవులకందని మధురిమలేవో
హృదయాలు చవిచూడగా ॥మనసు॥

# 18

పల్లవి :

ఆమె : విన్నానులే ప్రియా !
కనుగొన్నానులే ప్రియా!

అతడు : మిసిమి వయసూ గుసగుసలన్నీ
కొసరి విన్నానులే-విన్నానులే ప్రియా!

చరణం :

ఆమె : ఎదను దాచిన మౌనవీణా
కదిలి మ్రోగెనులే
ఆ-మధుర రాగాలలో
నీవె-ఒదిగివున్నావులే-ఒదిగివున్నావులే- ॥విన్నాను॥

చరణం :

అతడు : వికసించి వెలిగే నీ అందమూ
ఒక వేయిరేకుల అరవిందమూ
కళకళ నవ్వేనీకళ్ళూ

ఇద్దరు : కాముడు దాగిన పొదరిళ్ళూ
ఆ నీలినయనాలతో-నీవే
నిండివున్నావులే

ఆమె : నిండివున్నావులే ॥విన్నానులే॥

చరణం :

ఆమె : చిరుగాలివీచెను వింజామర
గగనాలు వేసెను విరితూయెల ॥చిరుగాలి॥
పల్లకి పంపెను తారకలు-
పందిరివేసెను చంద్రికలు

అతడు : ఆ పసిడి పందిళ్ళలో-మనకె
పరిణయమౌనులే
పరిణయమౌనులే ॥విన్నానులే॥

## 19

ఏ పారిజాతమ్ము లీయగలనో సఖీ !
గిరిమల్లికలు తప్ప-గరికపువ్వులు తప్ప
ఏ కానుకలను అందించగలనో చెలీ !
గుండెలోతుల దాచుకున్న వలపులు తప్ప!
జగతిపై నడయాడు చంచలా వల్లికా!
తరుణి ఆకృతిదాల్చు శరదిందు చంద్రికా
కలువపూల చెంతచేరి కైమోడుపుసేతును-నా
కలికిమిన్న కన్నులలో కలంకలముని విరియాలని
మబ్బులతో ఒక్కమారు మనవిచేసికొందును-నా
అంగన ఫాలాంగణమున ముంగురులై కదలాలని
చుక్కలతో ఒకసారి సూచింతును-నా ప్రేయసి
నల్లని వాల్జడ సందుల మల్లియలై మొలవాలని
పూర్ణసుధాకర బింబమ్మునకు వినతిసేతును-నా
పొలతికి ముఖబింబమై కళలు దిద్దుకోవాలని
ప్రకృతిముందు చేతులెత్తి ప్రార్థింతును కడసారిగా-నా
రమణికి బదులుగా ఆకారం ధరియించాలని !

# 20

పల్లవి :

ఆమె : ఎంతదూరము అది ఎంతదూరము
పరిమళించు పొన్నులకు
నిరీక్షించు చూపులకు
వేసిన తలుపులకు వేచిన తలపులకు
ఎంతచేరువో అంతదూరము.

చరణం :

అతడు : ఎంతదూరము అది ఎంతదూరము
ఉదయించే కిరణాలకు-ఉప్పొంగే కెరటాలకు
కలలుగనే చెలునికి-కలతపడే చెలియకూ
ఎంతచేరువో అది అంతదూరము

చరణం :

ఆమె : ఎంతదూరము అది ఎంతదూరము
మనసు పడని సంపంగికి
మరులు విడని భ్రమరానికి
ఉన్నదానికీ అనుకున్నదానికీ
ఎంతచేరువో అది అంతదూరము

చరణం :

అతడు : ఎంతదూరము అది ఎంతదూరము
అలనాటి ఆశలకు
అణగారిన బాసలకు
మరువరాని అందానికి
చెరిగిపోని బంధానికి
ఎంతచేరువో అది అంతదూరము

పల్లవి :

ఆమె : కలల అలలపై తేలెను
మనసు మల్లెపూవై

అతడు : ఎగిసిపోదునో చెలియా
నీవే ఇకనేనై

చరణం :

ఆమె : జలకమాడు జవరాలని
చిలిపిగచూసే వెందుకు ?

అతడు : తడిసీతడియని కొంగున
ఒడలుదాచుకున్నందుకు

ఆమె : చూపుతోనె హృదయవీణ
ఝుమ్మనిపించేవెందుకు ?

అతడు : విరిసీవిరియని పరువము
మరులుగొలుపుతున్నందుకు ॥కలల॥

చరణం :

ఆమె : సడి సవ్వడి వినిపించని
నడిరాతిరి ఏమన్నది ?

అతడు : జవరాలిని చెలికానిని
జంటగూడి రమ్మన్నది

ఆమె : విరజాజులు పరిమళించు
విరులపాను పేమన్నది ?

అతడు : అగుపించని ఆనందము
బిగికౌగిట కలదన్నది ॥కలల॥

అతడు : కురిసే వెన్నెల్లో మెరిసే గోదారిలా
మెరిసే గోదారిలో విరబూసిన నురగలా
నవ్వులారబోసే పడుచున్నది
కలువపువ్వు వేయిరేకులంతో విచ్చుకున్నది
పున్నమి ఎపుడెపుడా అని వేచియున్నది

ఆమె : కురిసే వెన్నెల్లో మెరిసే గోదారిలా
మెరిసే గోదారిలో ఎగసిపడే తరగలా
నాజూకు నెంబాలుడున్నాడు
నవమినాడే పున్నమి అని దిగుతున్నాడూ
పున్నమి యిపుడిపుడే అనిపిస్తున్నాడూ ॥కురిసే॥

అతడు : ఈ వెండివెన్నెల్లో ఏమిటి ఈ ఎరుపూ
ఎరుపా అది కాదు ఈ అరికాళ్ళ మెరుపూ

ఆమె : అమ్మో!

అతడు : ఆ కాలి ఎరుపు కెంపులుగా
ఆ చిరునవ్వులె మువ్వలుగా
ఆ మేని పసిమి పసిడిగా
అందాల వడ్డాణం అమరించాలి
అని తలచానేగాని ఆ నడుమేది ?

వచనం : ఇంతకూ-అది ఉన్నట్టా మరి లేనట్టా
నడుము ఉన్నట్టా మరి లేనట్టా

ఆమె : ఊహూ-

అతడు : పైటచెంగు అంచులుదాటి
అంచుపై ఉబికే పొంగులుదాటి
ఏటికి ఎదురీది ఈది-ఎటుతోచక నేనుంటే
మెరుపులాంటి ఎరుపేదో
కళ్ళకు మిరుమిట్లుగొలిపింది-

వచనం : ఏమిటది ?

# 23

పల్లవి :

ఆమె : మబ్బులో ఏముందీ ?—నా మనసులో ఏముందీ

అతడు : మబ్బులో కన్నీరు—నీ మనసులో పన్నీరు
అవునా ?

చరణం :

ఆమె : తోటలో ఏముందీ ?—నీ మాటలో ఏముంది ?

అతడు : తోటలో మల్లియలు—నీ మాటలో తేనియలు.

ఆమె : చేనులో ఏముందీ ?—నా మేనులో ఏముంది ?

అతడు : చేనులో బంగారం—నీ మేనులో సింగారం. ॥మబ్బులో॥

చరణం :

ఆమె : ఏటిలో ఏముంది ?—నా పాటలో ఏముంది ?

అతడు : ఏటిలో గలగలలు—నీ పాటలో సరిగమలు.

ఆమె : నేనులో ఏముంది—నీవులో ఏముంది

అతడు : నేనులో నీవుంది—నీవులో నేనుంది. ॥మబ్బులో॥

పల్లవి :

అతడు : ఎవరన్నారివి కన్నులని-
అరెరె మధువొలికే గిన్నెలని
ఎవరన్నారివి బుగ్గలని హాయ్
ఎర్రని రోజా మొగ్గలని.

చరణం :

ఆమె : నడుమిది యేమంటున్నది నా
నడుమిది యేమంటున్నది ?

అతడు : నా పిడికిట ఇమిడెదనన్నది

ఆమె : నల్లని జడ యేమన్నది-నా
నల్లనిజడ యేమన్నది ?

అతడు : అది నను బంధించెదనన్నది
నను బంధించెదనన్నది ॥ఎవ॥

చరణం :

ఆమె : సిగ్గులు దోసిట దూయకు
నా సిగ్గులు దోసిట దూయకూ
నీ చేతుల బందీ చేయకు

అతడు : మెల్లగ లోలో నవ్వకు
మెలమెల్లగ లోలో నవ్వకు
చలచల్లగ పిడుగులు రువ్వకు
చల్లగ పిడుగులు రువ్వకు ॥ఎవ॥

చరణం :

ఆమె : అడుగున అడుగిడు టెందుకు ?
నా అడుగున అడుగిడు టెందుకు ?

అతడు : నువు తడబడిపోతున్నందుకు

ఆమె : మరిమరి చూచెదవెందుకు ?
నను మరిమరి చూచెదవెందుకు ?

అతడు : నువు మైకములో వున్నందుకు. ॥ఎవ॥

---

దొరికితే దొంగలు

## 25

పల్లవి :

ఆమె : సన్నజాజి సొగసుంది
జున్నులాంటి వయసుంది
నిన్ను చూస్తే కరిగిపోయే
వెన్నలాంటి మనసుంది
ఇంతకుమించి ఏమిలేదురా ! బావా
యీ బతుకే యింక నీదిరా

అతడు : సన్నజాజి సొగసుంటే
జున్నులాంటి వయసుంటే
నన్ను చూస్తే కరిగిపోయే
వెన్నలాంటి మనసుంటే
అంతకుమించి ఏమి వద్దులే పిల్లా
ఆ మనసే ఎంతో ముద్దులే.

చరణం :

ఆమె : బంగారు నగలేవీ పెట్టుకోనురా
పట్టంచు చీరలేవీ కట్టుకోనురా
గుండెలో మొలకెత్తే
గోరువెచ్చని వలపే
పెదవుల భరణిలో
పొదిగి వుంచినానురా
ఇంతకుమించి ఏమి లేదురా-బావా
ఈవలపే యింక నీదిరా.

అతడు : మిసమిసలాడే నీమేనే బంగారం
సిగ్గే కంచిపట్టు చీరెకన్న సింగారం
పొంగే తేనియ వలపే
ముద్దుల మూటలో

ముడిచి దాచుకొందునే
అంతకుమించి ఏమి వద్దులే పిల్లా
ఆ మనసే ఎంతో ముద్దులే. ||సన్నజాజి||

చరణం :

ఆమె : రవ్వల మేడలంటే మనసులేదురా
పువ్వులపానుపంటే మోజులేదురా
పచ్చని చేలలో
పైరగాలి జోలలో
ముచ్చటైన గూడుకట్టి
వెచ్చగ వుందామురా
ఇంతకుమించి ఏమి కోరనురా
ఈ వరమొకటే చాలునురా.

అతడు : రవ్వలు ఎందుకు–నీ
నవ్వులు వుండగా
పువ్వులు ఎందుకు–నీ
పులకింతలు వుండగా
వీడని బాసలే
వాడని తీవెలుగా
వెన్నెల గూడుకట్టి
వేయి జన్మలుందాము

ఆమె : అంతకుమించి ఏమి కోరనులే
ఆ చల్లని కాపురమే చాలునులే. ||సన్నజాజి||

---

## కాలం మారింది

## 26

పల్లవి:

ఆమె : ప్రియా ప్రియా మధురం
పిల్లనగ్రోవి-పిల్లవాయువూ బలేబలే మధురం
అంతకుమించి ప్రియుని కౌగిలి
ఎంతోఎంతో మధురం.

అతడు : ఇన్ని వున్నా సరసిజలోచన-సరసనవుండేనే మధురం
మనసిచ్చిన ఆ అలివేణి అధరం-మరీమరీ మధురం

చరణం :

ఆమె : ఏ నాటి నా పూజాఫలమో
ఏ జన్మలో పొందిన వరమో
అందరుకోరే శ్యామసుందరుడె
నా పొందుకోరుట మధురం.

అతడు : సత్యాకృష్ణుల సరసజీవనం
నిత్యం నిత్యం మధురం
ప్రతి నిత్యం అతి మధురం. ॥ప్రియా॥

చరణం :

ఆమె : సవతులెందరున్నా కృష్ణయ్య
సత్యను వలచుట మధురం
భక్తికి రక్తికి లొంగని స్వామిని
కొంగున ముడుచుట మధురం-నా
కడకొంగున ముడుచుట మధురం.

అతడు : ఈ భామామణి ఏమిపలకినా
జౌనన్నటే మధురం

ఈ చెలి పలుకుల పర్యవసానం
ఇంకా ఇంకా మధురం ॥ప్రియా॥

చరణం

అతడు : నను దైవమ్ముగా నమ్మినదానవు
కడకొంగున నను ముడువనిదానవు
చల్లని ఓసతి ! జాంబవతీ ! నీ
సాహచర్యమే మధురం.

ఆమె : ప్రాణనాథ ! నీ పాదసేవలో
పరవశించుటే మధురం
తరియించుటే మధురాతిమధురం. ॥ప్రియా॥

## 27

పల్లవి :

వయసే ఒకపాఠం
వలపే ఒక పాఠం
గురువు చెప్పనిది
ప్రకృతి నేర్పేది-అదియే ప్రేమపాఠం.

చరణం :

ఆమె : కొమ్మలపైని గువ్వలజంటకు
గుసగుసలెవ్వరు నేర్పారు !
సరదాలెరిగిన యీ దొరగారికి
సరసాలెవ్వరు నేర్పేరు ! ॥వయసే॥

చరణం :

అతడు : నీ కాటుకకన్నులమాటున దాగిన
కమ్మని గాథలు చదివాను
నీ మూగపెదవుల కదలికలోన
మేఘసందేశం విన్నాను. ॥వయసే॥

చరణం :

ఆమె : వలపురీతులూ మనసులోతులూ
తెలపలేవు ఏ గ్రంథాలు

అతడు : ప్రణయమూర్తుల అనుభవాలే
మరువలేని ప్రబంధాలు. ॥వయసే॥

---

**వాడే-వీడు**

## 28

పల్లవి :

అతడు : మల్లెకన్న తెల్లన
వెన్నెలంత చల్లన

ఆమె : ఏదీ? ఏదీ? ఏదీ?

అతడు : మాసీత సొగసు

ఆమె : తేనెకన్న తీయన
తెలుగంత కమ్మన

అతడు : ఏదీ? ఏదీ? ఏదీ?

ఆమె : మాబావ మనసు.

చరణం :

నన్ను పిలిచి అత్తమ్మ అడగాలి
ఏమని ?
కన్నెసీత కలలన్నీ పండేది ఎపుడని ?
నాతోనే ఒకమాట చెప్పాలి
ఏమని ?
నీతోడే లేకుంటే ఈసీతే లేదని ॥మల్లెకన్న॥

చరణం :

మమతకు గుడిగా మారాలని వలపుంది
ఎందుకని ?
ఆగుడిలో దివ్వెగా వెలగాలని మనువుంది
ఎందుకని ?
ఆదివ్వెకు వెలుగై పోవాలని
బతుకుంది ఎందుకని ?
ఆవెలుగే నీవుగ చూడాలని ॥మల్లెకన్న॥

## 29

పల్లవి :

ఆమె : చల్లని చిరుగాలి-నిన్నొక
సంగతి అడగాలి
ఈరాజు నేకొమ్మ వలచెనో-తన
ఎదలోన ఏబొమ్మ నిలిచెనో

అతడు : చల్లని చిరుగాలి-నీకొక
సంగతి తెలపాలి
మనసైన ఒక కొమ్మ వలచింది-నాలో
మాటాడే బొమ్మ నిలిచింది.

చరణం :

ఆమె : కొమ్మ అనగానె సరిపోతుందా
బొమ్మ అనగానె అయిపోతుందా
పేరేలేదా-దానికి
ఊరేలేదా

అతడు : పరువం ఉరుకుతుంది-ఆ
పచ్చని మేనివంపులలో
బిడియం తొణుకుతుంది-ఆ
అడుగులు సాగని నడకలలో
ఎవరనుకున్నావు-ఆబొమ్మ
రవల అందాలవల రాచగుమ్మ ॥చల్లని॥

చరణం :

ఆమె : కబురులతోనే సరిపోయిందా
కవితల్లితే అయిపోయిందా
కన్నియ మనసే
కాస్త్రా కనుగొన్నావా

అతడు : ఉదయం పొంగుతుంది-ఆ
సుదతిదరహాస కిరణాలలో
హృదయం కలుకుతుంది-ఆ
ముదిత మూగనయనాలలో
ఎపుడో ఎపుడో ఈనేను-ఆ
ఎలనాగలో ఒదిగిపోయాను. ॥చల్లని॥

---

మా దైవం

పల్లవి :

తొలిరేయి-ఇది తొలిరేయి
ఇద్దరమూ చెరిసగమూ
ముద్దూముచ్చట పంచుకునే.

చరణం :

పెళ్ళిపందిట నీవు వేసిన మూడుముళ్ళు
చల్లచల్లగ వుండాలి అవి ఒక నూరేళ్ళు
మూగగదిలో నేడు పలికే యీరాగం
ముందుముందు బ్రతుకును పండించే అనురాగం
నవదంపతుల ఆశాలతల
పూచిన తొలిపూవు ఈరేయి ॥తొలిరేయి॥

చరణం :

కన్నులేమో వేరువేరు-కలలు ఒకటేలే
తనువులేమో వేరువేరు-మనసులొకటేలే
పూలపాన్పున వేయిమల్లెల పిలుపులొకటేలే
కలవరించే కోటి కోర్కెల గమ్యమొకటేలే
ఆలుమగల అంతరంగాల
అందాల తొలకరి యీ రేయి ॥తొలిరేయి॥

# 31

పల్లవి :

చిలికి చిలికి చిలిపి వయసు
వలపు వాన అవుతుంది
పలచి పలచి చెలియ మనసు
పూల పల్లకి అవుతుంది.

చరణం :

పొంగే కెరటం తీరం కోసం
పరుగులు తీస్తుంది
పూచే కుసుమం తుమ్మెదకోసం
దారులు కాస్తుంది
అందమంతా జంటకోసం
ఆరాటపడుతుంది । చిలిపి ।

చరణం :

తుంటరి పెదవి జంటను కోరి
తొందర చేస్తుంది
దాచిన తేనెలు దోచేదాకా
ఓపనంటుంది
రోజు రోజు కొత్త మోజు
రుచులేవో యిస్తుంది । చిలిపి ।

## 32

పల్లవి :

అతడు : నేడే తెలిసింది
ఈనాడే తెలిసింది
కమ్మని కలకే రూపం వస్తే
అది నీలాగే ఉంటుందనీ.

ఆమె : నేడే తెలిసింది
ఈనాడే తెలిసింది
తీయని పాటకు ప్రాణం వస్తే
అది నీలాగే ఉంటుందనీ.

చరణం :

అతడు : ఇంత మంచి రూపానికి
అంత మంచి మనసుంటుందని
ఆ మనసున అంతరాలకు
తావన్నది లేనే లేదని...
అది వలచే దొకసారేనని
ఆ వలపో విడిపోలేనిదని ।నేడే।

చరణం :

ఆమె : మారుమూల పల్లెలోన
మధురగాన ముదయించేనని
శిలలకైన ఆ గానం
పులకింతలు కలిగించేనని
అది జతగా నను చేరాలనీ
నా బ్రతుకే శ్రుతి చేయాలనీ ।నేడే।

---

ఆ రా ధ న

## 33

పల్లవి :

ఆమె : పగడాల జాబిలి చూడు— గగనాల దాగెను నేడు
వేయి అందాల నా రాజు— అందిన ఈ రోజు
ఎందుకులే నెలరేడు.

అతడు : పగడాల జాబిలి చూడు— గగనాల దాగెను నేడు
కోటి అందాల నా రాణి— అందిన యీ రేయి
ఎందుకులే నెలరేడు.

చరణం :

మనసూ మనసూ గుసగుసలాడెను
పెదవీ పెదవీ కువకువలాడెను

ఆమె : ఆకాశదీపాలు శయనించెను
నా కన్ను నీ కన్ను పయనించెను. ॥పగ॥

చరణం :

అతడు : బంగరు మమతలు పొంగులు వారెను
కొంగులు రెండు ముడివీడిపోయెను

ఆమె : గుడిలోని దేవుడు దీవించెను- నా
జడలోని పూవులు తిలకించెను ॥పగ॥

పల్లవి :

గాజులైతే తొడిగాడు నా రాజు- నా
మోజులన్నీ తీరేది ఏ రోజు–
చెయ్యి పట్టుకున్నాడు నా రాజు– ఇక
చెంగులు ముడివేసేది ఏ రోజు.

చరణం :

ప్రతి కోకిల సన్నాయిపాట పాడుతున్నది
ప్రతి చిలుక ముత్తయిదువా చేరుకున్నది
పెళ్ళిపడుచులా నా ఒళ్ళు ముడుచుకున్నది
మూడు ముళ్ళు తలుచుకుంటె సిగ్గు ముసురుతున్నది ||గాజు||

చరణం :

నా చిలిపి వయసు నేలమీద నిలువకున్నది
గాలి పల్లకిలో మల్లికలా వూరేగుతున్నది
రెండు కళ్ళలో ఒకే బొమ్మ నిండివున్నది
ఆ బొమ్మను చూస్తుంటే ప్రాణ మాగకున్నది ||గాజు||

---

డాక్టర్ బాబు

# 35

పల్లవి :

ఈ నీలి నీలి ముంగురులు
అందాల మబ్బుల దొంతరలు
ఈ కురుల నీడ చాలు
ఇంకెందుకు వేరే సిరులు.

చరణం :

ఈ కురులే పగలంతా పారాడు నీడలై
ఈ కురులే రాతిరిలో నడయాడు చీకటులై
ఈ కురులే వెన్నెలలో విరబూయు కలువలై
ఇవి కురులేనా— కావు—
నా గుండెలోని మరులు ॥ఈ నీలి॥

చరణం :

నీ నుదుట యీ కురులే కదలాడు తుమ్మెదలై
నా మదిలో యీ కురులే పలికేను కోకిలలై
నీ జడలో యీ కురులే ఒదిగేను యమునలై
ఇవి కురులేనా— కావు—
తరుణరాగ మంజరులు. ॥ఈ నీలి॥

# 36

పల్లవి :

ఇక్కడే కలుసుకున్నాము— ఎప్పుడో కలుసుకున్నాము
ఏ జన్మలోనో ఏ జన్మలోనో ఎన్నెన్ని జన్మలలోనో

చరణం :

ఆమె : నీల నీల గగనాల మేఘ తల్పాలపైన
పారిజాత సుమ సౌరభాల కెరటాలలోన

అతడు : నీల నీల గగనాల మేఘ తల్పాలపైన
పారిజాత కుసుమ సౌరభాల కెరటాలలోన

ఆమె : నీ చేయి నా పండువెన్నెల దిండుగా

అతడు : నీ రూపమే నా గుండెలో నిండగా

ఆమె : కలలన్నీ వడబోసి— కలలన్నీ వడబోసి

అతడు : కౌగిలిలో చవిచూసి

ఇద్దరు : ఇక్కడే కలుసుకున్నాము

చరణం :

అతడు : నాటి జన్మలో ఓ చెలీ ! నా చరణాల వాలి ఏమన్నావు ?

ఆమె : జన్మ జన్మలకు నా స్వామీ ! నీ చరణదాసినని అన్నాను

అతడు : అంతలో నిను చేరదీసి నే నేమన్నాను ?

ఆమె : ఓ సఖీ నా ఊపిరిలో నీ వున్నావని అన్నావు

ఇద్దరు : ఆనాటి అనుబంధం ఈనాటి మన బంధం
ఆనాటి అనుబంధం ఈనాటి మన బంధం

---

జీ వి త ం

## 37

పల్లవి :

పూలు గుసగుస లాడేనని - జత గూడేనని
గాలి యీలలు వేసేనని - సైగ చేసేనని
అది ఈ రోజే తెలిసిందీ.

చరణం :

మబ్బు కన్నెలు పిలిచేనని
మనసు రివ్వున ఎగిసేనని
వయసు సవ్వడి చేసేనని
ఇపుడె తెలిసింది, ॥పూలు॥

చరణం :

అలలు చేతులు సాచేనని
నురుగు నవ్వులు పూచేనని
నింగి నేలను తాకేనని
నేడే తెలిసింది. ॥పూలు॥

చరణం :

పైరు పచ్చగ ఎదిగున్నది
పల్లెపడుచుల వయసున్నది
కొత్తసొగసే రమ్మన్నది
గుండె ఝుమ్మన్నది. ॥పూలు॥

పల్లవి :

అతడు : అడగాలని ఉంది-ఒక
టడగాలని వుంది
అడిగినదానికి బదులిస్తే

ఆమె : ఇస్తే

అతడు : అందుకు బహుమానం ఒకటుంది.

చరణం :

అతడు : ఎదురుగా నిలుచుంటే
ఎంతో ముద్దుగ మెరిసేదేదీ ?
అందీ అందకుంటే
ఇంకెంతో అందం చిందేదేదీ ?

ఆమె : చేప-చూపు-సిగ్గు-మొగ్గ-

అతడు : మొగ్గకాదు-కన్నెపిల్ల బుగ్గ ! ॥అడ॥

చరణం :

ఆమె : కొత్తగా రుచిచూస్తుంటే
మత్తుగా వుండేదేదీ ?
మళ్ళీ తలచుకుంటే
మరింత రుచిగా వుండేదేదీ !

అతడు : వెన్న-జున్ను-తీపి-పులుపు-

ఆమె : పులుపుకాదు-తొలివలపు !! ॥అడ॥

చరణం :

అతడు : ఎంతగా చలివేస్తుంటె
అంతగా మనసయ్యేదేదీ ?
ఎంతగా చేరదీస్తే
అంతగా మురిపించేదేదీ ?

ఆమె : కుంపటి-దుప్పటి-గొంగళి-కంబళి-

అతడు : కంబళికాదు-కౌగిలీ !!
అడగాలనివుంది-అది
అడగాలనివుంది

ఆమె : అడగంగానే ఇచ్చేస్తే
అందులో రుచియేముందీ !! ॥అడ॥

---

## 39

పల్లవి :

అతడు : పాలరాతి మందిరాన
పడతిబొమ్మ అందం
అనురాగ గీతిలోన
అచ్చతెలుగు అందం.

చరణం :

అతడు : రతనాల కోటవుంది—రాచకన్నె లేదు
రంగైన తోటవుంది—రామచిలుక లేదు
ఆ రాచ కన్నెవు నీవై—అలరిస్తే అందం.
నా రామచిలుకవు నీవై—నవ్వితే అందం.
ఆమె : కన్నె మనసు ఏనాడూ సన్నజాజి తీగ
తోడులేని మరునాడు వాడిపోవుగదా
ఆ తీవెకు పందిరి నీవై అందుకుంటే అందం
ఆ కన్నెకు తోడుగా నిలిచి అల్లుకుంటె అందం ॥పాలరాతి॥

చరణం :

అతడు : నీ సోగ కన్నులపైన—బాస చేసినాను
నిండు మనసు కోవెలలోన—నిన్ను దాచినాను
ఆమె : ఇరువురిని ఏకంచేసే — ఈ రాగ బంధం
ఎన్నెన్ని జన్మలకైనా—చెరిగిపోని అందం
చెలుని వలపు నింపుకొన్న—చెలియ బ్రతుకు అందం
అనురాగ గీతిలోన—అచ్చతెలుగు అందం ॥పాల॥

## 40

పల్లవి :

ఆమె : రాధను నేనైతే నీ
రాధను నేనైతే

అతడు : నిను మలచుకుంటాను నా మురళిగా
నిను చేసుకుంటాను నా తరుణిగా

చరణం :

ఆమె : తోటనిండా మల్లియలు
తుంటరి పాటల తుమ్మెదలు
అల్లరి తుమ్మెదల అలికిడి వినగానే
మల్లెలు సవరించు పయ్యెదలు

అతడు : గడసరి చినవాడు తోడుగ వుంటే
కరుగును నును సిగ్గు పరదాలు
చిలిపిగ ననునీవు చేరుకుంటే
జలజల పొంగును పరువాలు ॥రాధను॥

చరణం :

ఆమె : రాధ అంటే ఎవ్వరది ?
మాధవు పాదాల పువ్వు అది
అంతటి స్వామి చెంతగ వుంటేనే
ఆమె మనసూ పూచేది

అతడు : తీయగసోకే పిల్లగాలికి
పూయని పువ్వే ఉంటుంధా ?
కన్నుగీటే వన్నెకానికి
కరగని జవ్వని ఉంటుందా ॥రాధను॥

---

ఇన్‌స్పెక్టర్ భార్య

## 41

పల్లవి :

ఆమె : ఊరంతా అనుకుంటున్నారు

అతడు : ఏమనీ-ఏమనీ-ఏమనీ-ఏమనీ.

ఆమె : సొగసైన చిన్నవానికీ-గడుసైన చిన్నదానికి
ముడి ఏదో బిగిసిందనీ

అతడు : ఊరంతా అనుకుంటున్నారు

ఆమె : ఏమనీ-ఏమనీ-ఏమనీ-ఏమనీ

అతడు : చారడేసి కళ్ళదానికి-దోరవయసు చిన్నవాడికి
జత బాగా కుదిరిందనీ.

చరణం :

ఆమె : చిన్నోడివాలకిం చిత్రంగా ఉందనీ
సన్నజాజులందేనే సరదా పెరిగిందని
మంచెమీద నిలుచున్నా-యింటికాడ కూచున్నా
పూలరంగడి మనసంతా ఆ బుల్లెమ్మమీదే ఉందనీ ॥ఊరంతా॥

అతడు : చిట్టెమ్మ చూపంతా-చుక్కల్లోనే ఉందనీ
కళ్ళకురాసే కాటుక-చెంపకు పూసేస్తుందనీ
అద్దమైన చూడదనీ-నిద్దురైన పోదనీ
పెళ్ళైతేనేగాని-ఆ పిల్లకు పిచ్చికుదరదనీ ॥ఊరంతా॥

ఆమె : సొగసైన చిన్నవాడికి

అతడు : గడుసైన చిన్నదానికి

ఇద్దరూ : ముడి ఏదో బిగిసిందనీ
హాయ్-హాయ్
ఊరంతా అనుకుంటున్నారు
మన ఊరంతా అనుకుంటున్నారు

---

రైతుకుటుంబం

## 42

పల్లవి :

సర్...సర్...సార్...
ఎప్పుడూ మీ పాఠాలంటే
ఎలాగండీ సార్
ఈరోజు నేచెబుతానూ
హియర్ మీ డియర్ సార్.

చరణం

ఒకటి ఒకటి కలిపితె రెండు
అది గణితం
మనసూ మనసూ కూడితే ఒకటే
ఇది జీవితం
గిరిగీసుకొని ఉండాలంటాయి గ్రంథాలు
పురివిప్పుకొని ఎగరాలంటాయి అందాలు ॥ఎప్పుడూ॥

చరణం

కళ్ళల్లో చూడండీ-కనిపించు నీలాలు
పెదవుల్లో చూడండీ-అగుపించును పగడాలు
దోసిలినిండా దొరుకుతాయి-దోరనవ్వుల ముత్యాలు
కన్నె మేనిలో ఉన్నాయి-ఏగనిలో దొరకని రతనాలు ॥ఎప్పుడూ॥

చరణం :

రాధా మాధవ రాగజీవనం-ఒక బంధం
కలువా జాబిలి వింతకలయికే-అనుబంధం
యుగయుగాలకూ మిగిలే దొకటే-అనురాగం
చెలి మనసెరిగిన చినవానిదేలే-ఆనందం ॥ఎప్పుడూ॥

---

## 43

పల్లవి :

అతడు : నీవైనచెప్పవే ఓమురళీ-ఇక
నీవైనచెప్పవే ప్రియమురళీ !
అడుగడుగున నాప్రియభామినిక
అలుక ఎందుకని-ఎందుకని.

ఆమె : నీవైన చెప్పవే జాబిలీ-ఇక
నీవైన చెప్పవే ఓ జాబిలీ
తలబంతి యెవరో-పదదాసి యెవరో
తెలుసుకొమ్మనీ-పిదప రమ్మనీ.

చరణం :

అతడు : అలుకలోన నాచెలియ వదనము
అరుణకమలమై విరిసెననీ
ఆ కమలములోని తేనియలానగ
నామది భ్రమరమై ఎగసెననీ ॥నీవైన॥

ఆమె : కోటిపూలతో కులుకు తుమ్మెదకు
ఈతోటలో చోటులేదనీ
మనసెరిగిన సత్యావిధేయునికే
అనురాగ మధువు అందుననీ ॥నీవైన॥

# 44

పల్లవి :

ఆమె : నిద్దురపోరా సామీ-నా ముద్దూమురిపాల సామీ
చలిరాతిరి తీరేదాకా-తెలతెలవారెదాకా.

చరణం :

ఆమె : మాయదారి మల్లెమొగ్గలు-మత్తుజల్లుతాయేమో
జిత్తులమారి సుక్కలు నిన్ను-ఎత్తుకపోతాయేమో
చెందురూని సూపు తగిలి కందిపోతావేమో
ఈచిన్నదాని చెంగుమాటున మోముదాచీ-ఆదమరిచి ॥నిద్దుర॥

చరణం :

అతడు : గుండెనిండా నువ్వే నిండి-గుసగుసలే పెడుతుంటే
కన్నెసిగ్గులే మల్లెమొగ్గలై-కన్నుగీటి కవ్విస్తుంటే
పండువెన్నెల పాలనురుగుల పానుపేసి పిలుస్తుంటే
పడుచుదనమే పిల్లగాలికి-పడగెత్తీ ఆడుతుంటే
నిద్దురపోనా పిల్లా-నాముద్దూమురిపాల పిల్లా
చలిరాతిరి తీరేదాకా-తెలతెలవారేదాక ॥నిద్దుర॥

## 45

పల్లవి :

అతడు : పలకరించితేనే ఉలికిఉలికి పడతావు
నిన్ను ప్రేమిస్తే ఏంజేస్తావో
మనసు పెనవేస్తే ఏమౌతావో

ఆమె : ఉలికిపాటుతోనే పులకరించి పోతావు
నేను ఔనంటే ఏం జేస్తావో
కాదు పొమ్మంటే ఏమౌతావో.

చరణం :

అతడు : మొలక నడుము హొయలుచూసి మురిసి పోదును
జిలుగుపైట నీడలోన పరవశింతును

ఆమె : సొగసులొలుకు నడుము హొయలు చూడనీయను
కడకొంగున నిను బిగించి నడచి పోదునూ ॥ఉలికి॥

చరణం :

అతడు : పువ్వునై కురులలో పొంచియుందును
నవ్వునై పెదవిపై పవ్వళింతునూ

ఆమె : పూలతోడ నిన్నుకూడ ముడుచుకొందును
పెదవిపైన అదిమి నిన్ను కదలనీయనూ ॥పలకరించి॥

చరణం :

అతడు : కలలనైన నిన్నునేను కలుసుకొందునూ
దొంగనై దోర వలపు దోచుకొందునూ

ఆమె : చిలిపి చిలిపి మాటలింక చెల్లవందును
తొలివలపుల తియ్యదనం తెలుపమందునూ

అతడు : పలకరించితేనే

ఆమె : ఉలికిపాటు

---

**జమీందార్**

# 46

పల్లవి :

ఈ లోయలోన ఈ పాయలోన
నిలువెల్ల సోకే - నీరెండలోన
మనసూగింది ఉయ్యాలలా
కదలే గోదావరి కెరటాలలా

చరణం :

సరసాల చిరుగాలి-గురిచూసి వీచింది
పులకించు పరువం-పురివిప్పి ఆడింది
కొంటె పొదరిల్లు-కొనకొంగు లాగింది
గుండె ఝల్లంది, ఝల్లంది...ఓ ॥మన॥

చరణం :

నీలాటి రేవులోన-నీడయేదో కదిలింది
నను చూసి ఎవరో-నవ్వినట్టు తోచింది.
అమ్మో ! కొరమీను అరికాలు మీటింది
ఒళ్ళు జిల్లంది జిల్లంది-ఓ. ॥మన॥

# 47

పల్లవి :

అతడు : ఓ దేవి ! ఏమికన్నులు నీవి
కలకలనవ్వే కలువలు అవి
కాముని పున్నమి చలువలు.

చరణం :

ఆమె : వాడిపోయే వీడిపోయే
కొలనులోని కలువపూలు నా నయనాలా !
చాలు...చాలు...చాలూ. ॥ఓదేవి॥

చరణం :

అతడు : ఏమని అందును ఎర్రని పెదవుల అందాలు
అవి ఎంతో వింతగ మెరిసే నున్నని పగడాలు

ఆమె : రూపమేకాని రుచియేలేని పగడాలు
తేనియలూరె తీయని పెదవికి సరిరావు సరిరావు
చాలు...చాలు...చాలూ ॥ఓదేవి॥

చరణం :

అతడు : కులుకుల నడకల కలహంసలు కదలాడెనా
నల్లని జడలో నాగులు పూగిసలాడెనా
దివికీ భువికీ పంతెనవేసెను నీ సొగసు

ఆమె : అల్లరిపిల్లకు కళ్లెంవేసెను నీ మనసు నీ మనసు
చాలు...చాలు...చాలూ.

అతడు : ఓ దేవి ఏమి సొగసులు నీవి

ఆమె : ఓ రాజా ! రసికతారసరాజా.

---

# 48

పల్లవి :

ఆమె : పిల్లనగ్రోవి పిలుపు మెల
మెల్లన రేపెను వలపు
మమతలు దాచిన మనసు - ఒక
మాధవునికే తెలుసు-యీ
మాధవునికే తెలుసు.

అతడు : సుందరి అందెల పిలుపు-నా
డెందమునందొక మెరుపు
నందకిశోరుని మనసు-రత
నాల బొమ్మకు తెలుసు-యీ
రతనాల బొమ్మకు తెలుసు.

చరణం :

ఆమె : వెన్నమీగడలు తిన్నావట
వెన్నెలలో ఆడుకున్నావట
ఎన్నో నేర్చిన వన్నెకాడివట
ఏమందువో మరి-నామాట
ఏమందువోమరి నామాట.

అతడు : వెన్నమీగడలు తిన్నది నిజము
ఎన్నో నేర్చితివన్నదీ నిజము
చిన్నారీ-నీ కన్నుల బాసలు
వెన్నుని దోచిన ఆమాట నిజము
వెన్నుని దోచినమాట నిజము ॥సుందరి అందెల॥

చరణం :

అందీ అందని అందగాడవని
ఎందరో అనగా విన్నాను

అందులోని పరమార్థమేమిటో
అలవోకగా కనుగొన్నాను
అలవోకగా కనుగొన్నాను.

అతడు : ఎంత బేలవని అనుకున్నానో
అంత గడసరి తరుణివిలే
అష్టభార్యలతో అలరే రాజును
చెంగున ముడిచిన చెలువవులే
చెలువవులే-చెంగలువవులే. ॥పిల్లన॥

# 49

పల్లవి :

భువన మోహిని
అవధిలేని యుగయుగాల
అమృతవాహిని ॥భువ॥

చరణం :

నీలనీల కుంతలా-వి
లోల మృదుల చేలాంచల
తరళతరళ భావగగన
సురభిళ నవచంచలా !
మధురమధుర హాసినీ
మదనహృదయ వాసిని ॥భువ॥

చరణం :

మదమరాళ గామిని
మంజుల మధుయామిని !
ఝళంఝళిత మణినూపుర
లలితలయ విలాసిని !
రాగతాళ భావరంజని
తధీం తనన తధీం తనన తధీం తనన ! ॥భువ॥

## 50

సాకి :

ఆమె : మెరుగు చామనచాయ
మేని సొంపులవాడు
నునుమీగ్గడల తేలు
మనసున్న చెలికాడు
దొరవోలె నామనసు దోచుకున్నాడే

పల్లవి :

జగములనేలే-గోపాలుడే
నా సిగలో పూవౌను-ఈనాడే

అతడు : మనువులనేలే గోపాలుడే
నీ మనసే దోచెను-ఈనాడే
మనువల నేలే గోపాలుడే.

చరణం :

ఆమె : ఘుమఘుమలాడే మమతల మల్లెలు
కోరినంతనే దొరకవులే

అతడు : మదనుని గెలిచిన మగరాయనిగని
మల్లెలు తామే వలచునులే
మగువా-నీ మది తెలిసెనులే.

ఆమె : జగముల నేలే-గోపాలుడే

అతడు : నీ మనసే దోచెను-ఈనాడే.

చరణం :

ఆమె : భామామానస పంజరమ్ములో
రామచిలుకవై నిలిచేవా

అతడు : పంజరమైనా ప్రణయ దాసునికి
పసిడి మేడయే ప్రియురాలా
బాసయె-చేసెద-ఈవేళా

ఆమె : జగముల నేలే గోపాలుడే

అతడు : నీ మనసే దోచెను ఈనాడే.

చరణం :

ఆమె : చేసిన బాసలు చిగురులు వేయగ
గీసిన గీటును దాటవుగా

అతడు : అందముతో నను బందీచేసిన
సుందరియానతి-దాటేనా
ఉందునే ఓ చెలి-నీలోన

ఆమె : జగముల నేలే గోపాలుడే
నా సిగలో పూవాయె-ఈనాడే

అతడు : మగువుల నేలే గోపాలుడే
నీ మనసే దోచెను ఈనాడే.

## 51

పల్లవి:

ఆమె : చారడేసి కనులతో చేరుకొంటి నిన్ను
గగనమంత మనసుతో కలుసుకో నన్నూ

అతడు : గగనమంత మనసుతో కలుసుకొంటి నిన్నూ
దోరదోరవయసుతో దోచుకో నన్నూ

చరణం :

ఆమె : మదనుడు నిన్నుగనీ పొదలో దాగెనూ
చంద్రుడు నిన్నుగనీ-చాటున దాగెనూ
ఈ మోహనరూపమ్ము
ఎన్నాళ్ళు దాచేవు
ఇలాగే: ఇలాగే నిలవాలి నీవు. ||చార||

చరణం :

అతడు : పిల్లతిమ్మెరలోని పిలుపులు విన్నాను
అణువున అణువున నీ అందాలు కన్నాను
ఏనాడో నీలోనె లీనమైవున్నాను
ఇలాగే ఇలాగే నిలిచాను నేను. ||చార||

---

**రహస్యం**

## 52

పల్లవి :

నాలో-నీలో
పలికింది ఒకేరాగం
నాలో-నీలో
నిలిచింది ఒకే బంధం

చరణం :

మచ్చలేని చందురుడే లేడని తెలుసు
మసి అంటని దీపమే లేదని తెలుసు
మచ్చను మరపించే-మంచిని వెలిగించే
మనిషిని కావాలని అన్నది నా మనసు. ॥నాలో॥

చరణం :

కసిరిన నీ పెదవి కలకల నవ్వదా
కొట్టిన నీ చేయి కురులను దువ్వదా
చిందిన కన్నీరే చెలిమిగ మారదా
తీయని ఆ చెలిమి తేనెలే చిందదా. ॥నాలో॥

---

చెల్లెలికోసం

## 53

పల్లవి :

ఏమిటో ఇది ఏమిటో
పలుకలేని మౌనగీతి
తెలియరాని అనుభూతి
ఏమిటో ఇది ఏమిటో !

చరణం :

అద్దంలో నా నీడ-ముద్దుముద్దుగా తోచింది
ఆ నీడ నను చూసి-అదోలా నవ్వేసింది
చెప్పకనే చిలిపి పయ్యెద-చప్పున జారిపోయింది
ఒంటరిగా పడుకుంటే-కొంటె నిదుర రానంటుంది ॥పలుక॥

చరణం :

చీకటిలో నిదుర రానిచో
చిరుదివ్వెను వెలిగించనా
ఆ చిరువెలుగే పనికిరానిచో
నా కనులే వెలిగించనా ॥పలుక॥

చరణం :

తలపులు దాచిన నా మనసే తలగడగా అందించనా
కమ్మని కలలే పండేదాకా
కథలేవో వినిపించనా ॥పలుక॥

చరణం :

గుండెలోన వలపుమల్లి-కొత్తరేకులు విరిసింది
కిటికీలోన జాబిల్లి-కటిక నిప్పులు చెరిగింది
విరిసిన వలపే ఘుమఘుమలాడే
తరుణం రానేవస్తుంది
కోరిన ప్రియుడే సందిటవుంటే
గుండె చల్లబడిపోతుంది ॥పలుక॥

పల్లవి :

ఆమె : నేడే ఈనాడే
కరుణించె నన్ను చెలికాడే

చరణం :

ఆమె : కనులముందున్న రతనాలమూర్తిని
విలువెరుగక విసిరితిని
కనులు తెరచీ విలువ తెలిసీ
మనసే గుడిగా మలచితిసీ ॥నేడే॥

చరణం :

ఆమె : మదిలో విరిసే మమతల మాలలు
చెలిమికి కానుక చేసెదను
ఆరని వలపుల హారతి వెలుగుల
కలకాలం నిను కొలిచెదను ॥నేడే॥

చరణం ;

అతడు : చిలిపిగ కసిరే చెలియ విసురులో
అలకలు గని నవ్వుకున్నాను
చేతులు సాచి చెంతకు చేరిన
ఆ చెలినే అందుకున్నాను
నేడే ఈనాడే
మురిపించె నన్ను చెలి తానే ॥నేడే॥

# 55

పల్లవి :

అతడు : చెలికాడు నిన్నే రమ్మని పిలువ-చేరరావేలా
ఇంకా సిగ్గు నీకేలా

ఆమె : ప్రియురాలి మదిలో ఏముందో తెలుసుకోలేవా
నన్నే తెలుపమంటావా.

చరణం :

అతడు : నీ నవ్వులో ఏ పువ్వులో-పన్నీరు చిలికాయీ

ఆమె : కిరణాలలోనేగా సరోజం కిలకిల నవ్వేదీ ॥చెలి॥

చరణం :

అతడు : నీ అందమే శ్రీగంధమై-నా డెందమలరించే

ఆమె : నీ రూపె దీపమ్మై ప్రియా-నా చూపుల వెలిగించే ॥చెలి॥

చరణం :

అతడు : నీ తోడుగా నడయాడగా-ఇంకేమి కావాలి ?

ఆమె : మధురానురాగాలే ఫలించే తరుణం రావాలి. ॥చెలి॥

## 56

పల్లవి :

దాచాలంటే దాగదులే
దాగుడుమూతలు సాగవులే
వలపుల సంకెలు బిగిసేదాకా
వదలను వదలను వదలనులే.

చరణం :

నీ సన్నని మీసంలో విలాసం-వన్నెలు చిలికింది
నీ నున్నని బుగ్గలపై పున్నమి వెన్నెల మెరిసింది
నీ ఓరచూపులనుగని బంగారు తూపులనుకొని
మురిసిపోతాను-పరవశించేనూ
నీ కన్నులు రమ్మని పిలిచేదాకా
కదలను కదలను కదలనులే. ॥దాచాలంటే॥

చరణం :

పొదలలోనవున్నా పూలగంధాలు దాగలేవు
పుట్టలోనవున్నా మణుల అందాలు మాసిపోవు
నీలోని రూపమునుగని-రతనాలదీపమనుకొని
మదిని నిలిపేనూ-జగము మరిచేను.
నీ పెదవుల నవ్వులు విరిసేదాకా
విడువను విడువను విడువనులే. ॥దాచాలంటే॥

# 57

పల్లవి :

అయ్యయ్యో-బ్రహ్మయ్యా-అన్యాయం చేశావేమయ్యా
ఈ బుల్లోడే బుల్లెమ్మయితే-ఎంత గుమ్ముగా ఉండేదయ్యా

చరణం :

చిక్కని మీగడ తరకల్లాగా-చక్కనైన చెక్కిళ్లు
పసినిమ్మ పండులాదా-మిసమిసలాడే ఒళ్లు
బెట్టుచూపి గుట్టుదాచే-గడసరి సొగసరికళ్లు
కొంత కోడెతనముంది-మరికొంత ఆడతనముంది ॥అయ్యయ్యో॥

చరణం :

మూతిచూస్తే మీసమింకా-మొలిచినట్టులేదూ
బెదురుచూస్తే ఎవ్వరితోను-కుదిరినట్టులేదూ - ఆ
కసురులోనె అలకనవ్వులు-విసురు లేకపోలేదు
కొంత చిలిపితనముందీ-మరికొంత కలికితనముంది. ॥అయ్యయ్యో॥

చరణం :

బులిపించే సొగసున్న ఓ బుల్లోడా-నిను చూస్తుంటే
కొమ్ములు తిరిగిన మగాడికే-దిమ్మెక్కిపోతుంటే
కన్నెపిల్లలే చూశారా-కన్నుగీటక మానేరా ?
కవ్వించే కౌగిలిలో-కరిగించక వొదిలేరా ? ॥అయ్యయ్యో॥

---

# 58

పల్లవి :

ఎవరనుకున్నావే—ఏమనుకున్నావే
చక్కని చెలికాడే—చిక్కని నెలరేడే
ఎవడే ఎవడే—ఇంకెవడే నా ప్రియుడే.

చరణం :

ఎవరనుకున్నావే ఏమనుకున్నావే
ఎగు భుజములవాడే-మగసిరి కలవాడే
ఎవడే-ఎవడే-ఇంకెవడే-నా ప్రియుడే.
చెంపకు చేరడేసి కన్నులతో
సంపంగి పూలవంటి వన్నెలతో
కలలో తానే కనిపించాడే
చెలియా నన్నే కవ్వించాడే ॥ఎవరను

చరణం :

అతడే కోరచూపు చూస్తుంటే
ఆపైన పడుచుగాలి వీస్తుంటే
ఏదో ఏదో అయిపోతాడే
ఎంతో ఎంతో బాగుంటాదే. ॥ఎవరను

చరణం :

చల్లని నీటిలోన నేనుంటిని
వెచ్చని నారాజు తోడుంటే
మనసే లోలో ఝుమ్మంటాదే
వలపే అలయై రమ్మంటాదే
వలపే అలయై రమ్మంటాదే
ఎవడే ఎవడే ఇంకెవడే నా ప్రియుడే. ॥ఎవరను

---

అగ్గిపిడుగు

## 59

పల్లవి :

విన్నావా విన్నావా
మనసులోన దాగియున్న మధురగీతి

చరణం :

తొలిచూపులు నా మదిలో తలుపు తీసెనే
పెదవులపై చిరునవ్వులు నిదురలేచెనే ॥విన్నావా॥

చరణం :

తలపులన్ని వేణువులై పిలువసాగెనే
హృదయమె యమునానదియై కదలసాగెనే ॥విన్నావా॥

చరణం :

అందరాని చందమామ ముందు నిలిచెనే
అణువణువున వెన్నెలలే ఆరపోసెనే ॥విన్నావా॥

చరణం :

వలపులు విరజాజులుగా పరిమళించెనే
జగమే బృందావనియై సొగసులొలికెనే. ॥విన్నావా॥

## 60

పల్లవి :

ఊయలలూగినదోయి మనసే
తీయని ఊహల తీవెలపైన.

చరణం :

వెన్నెల పూవులు విరిసేవేళ
సన్నని గాలులు సాగేవేళ
వలపులు ఏవో పలికెను నాలో
తెలుపగరానిది ఈహాయి. ॥ఊయల॥

చరణం :

కమ్మని రాతిరి రమ్మని పిలిచె
మల్లెల పానుపు మనకై నిలిచె
ప్రాయము నీవై పరువము నేనై
పరిమళించగా రావోయి. ॥ఊయల॥

# 61

పల్లవి :

ఎవరికీ తెలియదులే ఇంతుల సంగతి
ఇంతుల సంగతి పూబంతుల సంగతి

చరణం :

జడలో మల్లెపూల జాతర చేస్తుంటారు
బంగారు పెదవులపై రంగులు పూస్తుంటారు
గా షోకులన్నీ ఇంకెవరికోసమంటారు ॥ఎవరికి॥

చరణం :

ముసిముసి నగవులతో మిసమిస చూపులతో
దాచుకున్న తలపులతో దోచుకున్న వలపులతో
మొదట కసిరికొడతారు పిదప చల్లబడతారు ॥ఎవరికి॥

చరణం :

పందిరి లేకుంటే తీగ పైకిపోతుందా
గోడలు లేకుంటే గోపురమే వుంటుందా
పురుషులు లేకుంటే తరుణుల పని గోవిందా ॥ఎవరికి॥

పల్లవి :

ఆమె : 1 : నీళ్లేమంటున్నాయి ఓ వదినా!
చన్నీళ్లేమంటున్నాయి ఓ వదినా!

చరణం :

ఆమె : 2 : నీళ్లేకదా అని నేసిదబోతే-నిప్పులుగామారె మరదలా
ఎప్పుడూ ఎరగను నేనిలా-యిలా-యిలా-యిలా

ఆమె : 1 : నీటిలోన నిప్పులంటే నేను నమ్మలేనమ్మా
అదే అదే నీ వయసులోని-ఆవిరే జానేమో

ఆమె : 2 : ఉన్నమాట అన్నావు యీ వేళ-ఆ
వన్నెకాడు రేపొడు యీ జ్వాల ॥నీళ్లే॥

చరణం :

ఆమె : 1 : చిలిపిగ విసిరే చలిగాలి-నీ
చెవిలో ఏమని చెబుతున్నదీ

ఆమె : 2 : నీవున్నచోటే మీ అన్న వుంటే-
ఆ వరసే వేరని అంటున్నది
నీళ్లేమంటున్నాయి మరదలా-
చన్నీళ్లేమంటున్నాయి మరదలా.

చరణం :

ఆమె : 1 : నీళ్ళో నిప్పులో-తెలియదుగానీ-నా-
ఒళ్ళంత వుడుకెత్తె ఏదోలా
ఎప్పుడూ ఎరగను నేనిలా-యిలా-యిలా-యిలా

ఆమె : 2 : ఇందాకలేని యీ వింతవేడి-
ఈ క్షణమేల కలిగిందమ్మో

ఆమె : 1 : నీ ఒంటిలోన నిలువని ఆ వేడి-
మెరుపై నాలో వురికిందమ్మో

ఆమె : 2 : రేపో, మాపో వస్తాడు తగినోడు-
ఈ తాపమంతా తగ్గించిపోతాడు ॥నీళ్లే॥

---

## పల్లెటూరి చిన్నోడు

## 63

సాకీ :

ఆ లోకం కంచెలు దాటి
ఈలోకం కౌగిలిలోకి
విచ్చేసిన రసికులకు స్వాగతం !
వెచ్చని నెలరాజులకు స్వాగతం !

పల్లవి :

అటు తుదిజాములో పొద్దు వాలిందిలే
ఇటు తొలిపొద్దు పొడిచిందిలే
అది మనిషిని బంధించే చెరసాల
ఇది మనసును విడిపించే మధుశాల.

చరణం :

ఈ కళ్లలో - సిరి వాకిళ్లలో
చూపులే ఆరవేసేరు కొందరు
ఈ మేనిలో-మెరిసే మెరుపులో
మనసే జారవిడిచేరు కొందరు
ఈ నడకలో-పలికే అడుగులో
పులకించిపోని తలవంచలేని వారెవ్వరు
ఎవ్వరు ? ఎవ్వరు ? ఇంకెవ్వరు ? ॥అటు॥

చరణం :

పోగొట్టుకున్నవారు ఏదో పొందగా వస్తారు
పొందినవారేమో పోగొట్టుకొని పోతారు
బ్రతుకులో చేదుందనీ పారిపోయి వస్తారు
చెలి అందించే చేదును మింగి బలే తీపి అంటారు
ఈ తీపిలో-పెరిగే కైపులో
రుచి మరిగిపోయి ఇటు తిరిగిరాని వారెవ్వరు ?
ఎవ్వరు ? ఎవ్వరు ? ఇంకెవ్వరు ? ॥అటు॥

---

హారతి

# 64

పల్లవి :

ఆహా!-అందమునిండే హృదయ కమలం
అందుకునే రాజొకడే-ఆహా!
అందుకునే రాజొకడే.

చరణం :

వేలతారకల బృందములోనూ
వెలిగే చందురుడొకడే
వెలిగే చందురుడొకడే. ॥ఆహా॥

చరణం :

వెన్నెలరేకుల వాకిళ్లుతీసి
సన్నని వలపుల సాంబ్రాణివేసి
ఎదురుచూసేది-ఎవరికోసమే. ॥ఆహా॥

చరణం :

కత్తులుదూసి జడిపించువాడు
మెత్తని ప్రేమను సాధించలేడు
కన్నుల బాసలు తెలియనివాడు
కన్నియ మనసును గెలువగలేడు. ॥ఆహా॥

పల్లవి :

చిగురువేసెనే చిలిపికోరిక
ఎగిసిపోయెనే మనసు ఆగక
చుక్కలే పిలిచెనోయేమో-నాకే
రెక్కలే మొలిచెనో-ఓయమ్మో.

చరణం :

ఏ పైడిమేడలోని చినవాడో
ఈ పల్లె పొలిమేర దిగినాడే
ఏ మబ్బుకోటనేలు నెలరేడో
నామీద మనసాయెనన్నాడే
చెక్కిట చిటికేసీ
చేతిలో చెయివేసీ
ఒంటరితనమింకా-
ఉండగూడదన్నాడే-ఓయమ్మో. ॥చిగురు॥

చరణం :

ఏ రామచిలకతో కబురంపీ
ఆ రాజు ననుచేర వస్తాడే
ఏ రవల ఉంగరమో అందించీ
ఎదనిండ పూదండ వేస్తాడే
ఇక్కడ నేనున్నా
ఎక్కడో తానున్నా
ఎదురుగ ఉన్నటులే-
ఒదిగి నవ్వుతున్నాడే-ఓయమ్మో. ॥చిగురు॥

66

పల్లవి:

శారదా!-ననుచేరదా
ఏమిటమ్మా సిగ్గా-ఎరుపెక్కే లేత బుగ్గా
ఓ శ్రావణ నీరద! శారదా!

చరణం:

ఏమిరూపమిది-ఇంద్రచాపమది
ఏమి కోపమది-చంద్ర తాపమది
ఏమి ఆ హొయలు
ఏమి కులుకు-సెలయేటి పిలుపు-అది
ఏమి అడుగు-కలహంసనడుగు-హొయ్
ఏమి ఆ లయలు
కలగా కదిలే ఆ అందం
కావాలన్నది నా హృదయం-ఓ శ్రావణనీరద! శారదా ॥శారదా॥

చరణం:

నీలి కళ్ళలో-నా నీడ చూచుకొని
పాలనవ్వులో-పూలు దాచుకొని
పరిమళించేనా.
చెండువోలె-విరిదండవోలె-నిను
గుండెకద్దుకొని-నిండుముద్దుగొని
పరవశించేనా
అలలై పొంగే అనురాగం
పులకించాలి కలకాలం-ఓ శ్రావణనీరదా! శారదా.! ॥శారదా॥

## 67

పల్లవి:

ఎక్కడివాడో కానీ చక్కనివాడే
ఎక్కడివాడైతేమి!–మక్కువగలవాడే
నామదిదోచిన చిన్నవాడే-ఓయమ్మ
నామదిదోచిన చిన్నవాడే.

చరణం :

సూరీడు వుండగానే సుక్కలు సూస్తాడే
యెండలోనె యెన్నెల పంటలు పండిస్తాడే
ముళ్ళలోనే జాజిమల్లెలు పూయిస్తాడే-వాడు
రాళ్ళలోనే తీయనిరాగాలు పలికిస్తాడే. ॥ఎక్కడి॥

చరణం :

తాను పల్లకిలో వూరేగి వస్తుంటే-
నేను పెళ్లిపడుచునై ఎదురుచూస్తుంటే
నేను తొలిరాతిరి మొగ్గనై ముడుచుకుంటే
తాను మొగ్గనే పూవులా మలచుకుంటే. ॥ఎక్కడి॥

చరణం :

తలచుకుంటేనే ఒళ్లు నిలవకున్నాదే-వాడు
తాకితే ఓయమ్మ ఏమైపోతానో
పట్టలేక తీగలాగ చుట్టుకుంటానో
తట్టుకోని వేడిలో కాగిపోతానో-కరగిపోతానో. ॥ఎక్కడి॥

ఖైదీబాబాయ్

అతడు : తెరసాప నీడలోన
మునిమాపు యేళలోన
యెలుగునీడల్లాగ
యేకమయిపోదామా

ఆమె : సక్కనయిన సిన్నోడా
పక్కనున్న నావోడా
కోరినవన్నీ కాదనకుండా యిస్తావా-మరి
చేరుకుంటే నీరుగారి పోతావా ॥సక్కనయిన॥

అతడు : సేపకళ్ళ సిన్నదానా
సింతపువ్వు వన్నెదానా
కోరినవన్ని కాదనకుండా యిస్తానే-అవి
మళ్ళీమళ్ళీ కోరకుండా చూస్తానే ॥సేపకళ్ళ॥

ఆమె : కదిలే గాలిలోన-నే
కరిగే మబ్బునౌతా-ఆ
కరిగే మబ్బుపైనా
ఎగిరెగిరే గువ్వనౌతా.

అతడు : ఎగిరే గువ్వవు నీవైతే
తరిమే డేగ నేనౌతా-నా
రెక్కలోన నిన్ను వెచ్చగ దాచేస్తా-హాయ్
రేతిరి పగలూ నీ మనసంతా కాజేస్తా ॥సేపకళ్ళ॥

ఆమె : పారే యేటిలోన-పొం
గారే పాయనౌతా-ఆ
యేటి పాయలోన
ఎదురీదే చేపనౌతా ॥పారే॥

అతడు : ఈదే చేపవు నువ్వయితే-ఐతే
గాలాన్ని నేనౌతా-నీ
గుండెలోకి గురిచూసి లాగేస్తా-నీ
అందాలన్నీ వడబోసీ తాగేస్తా-హోయ్ ॥సేపకళ్ళ॥

## 69

పల్లవి :

అతడు : మల్లెపూల తెప్పగట్టి
ఉల్లిపూల తెరచాపెత్తి
తెప్పమీద తేలిపోదామా

ఆమె : భల్ మోహనరంగా
తెలియరాని తీరం చూదామా

అతడు : భల్ మోహనరంగా తెలియరాని తీరం చూదామా.

చరణం :

అతడు : పైటచెంగు పందిరికింద
బాసలేవో చేసుకుంటూ
ఒకరి కంటిపాపలోన
ఒకరినీడ చూసుకుంటూ
గోరువెచ్చని కలలే కందామా

ఆమె : భల్ మోహనరంగా
వూరు వూసే మరచిపోదామా. ||మల్లెపూల||

చరణం :

ఆమె : మనసే ఒక పానుపుచేసీ
వలపే ఒక తలగడచేసీ
విడిపోనీ కౌగిలిలో
పగలూరేయీ ముడివేసి
కలకాలం కాపురముందామా.

అతడు : భల్ మోహనరంగీ
ఇలనే ఒక స్వర్గం చేదామా. ||మల్లెపూల||

---

## బంట్రోతు భార్య

# 70

పల్లవి :

ఎప్పుడూ నిన్నే ఇలాగే చూడాలి
చప్పుడు చేయని నీ కనురెప్పల
సరిగమలే వినాలి-వినాలి.

చరణం :

ఒకేఅడుగులో ఇద్దరి అడుగులు
ఒద్దికగా ఇమడాలి
ఒకేగొంతులో ఇద్దరి మనసులు
ఊసులాడుకోవాలి
బాసచేసుకోవాలి. ॥ఎప్పుడూ॥

చరణం :

తెలుగులోని తేనెలన్నీ—నీ
జిలుగు పెదవులు అందివ్వాలి
చైత్రపూర్ణిమల కళలన్నీ-నీ
చిరునవ్వులలో విరబూయాలి. ॥ఎప్పుడూ॥

# 71

పల్లవి :

రావా ! నను చేరలేవా !
ఎటుచూసినా పతుమజంటలే
ఎటుచూసినా వలపుపంటలే
ప్రతినిమిషం నినుచూసీ
నీకోసం చెయిసాచీ
విధిలేక లోలోన - విలపించుటేనా.

చరణం :

ఉన్నాము ఒక యింటిలోన-కాని
ఎన్నెన్ని కనరాని పరదాలో
చేరుకున్నాము ఒక పాన్పుపైన-కాని
ఎన్నెన్ని దరిలేని దూరాలో
నువ్వు ఎదటుండి ఎంతెంత విరహం
నేను బతికుండి ఇది వింత మరణం ॥రావా॥

చరణం :

నిను నిన్నుగా నేను వలచాను-నా
మనసంత నీచేత నిలిపాను
ఆ మూగమనసే విసిరేసినావు
అనురాగబంధం తెగగోసినావు
ఇంకా కసితీరలేదా
ఎన్నాళ్ళు ఈ నరకబాధ ? ॥రావా॥

# 72

పల్లవి :

అతడు : ఏమని వ్రాయను-ఏమని వ్రాయను
ప్రతి పలుకూ విరహగీతమై
పరవశింపజేస్తుంటే

ఆమె : ఏమని వ్రాయను-ఏమని వ్రాయను
ప్రతి పలుకూ నీ రూపమై
పలకరించిపోతూంటే.

చరణం :

అతడు : నింగిలోన తారలున్నా-నీ కనుపాపలే కనుపించగా
తోటలోన పూలెన్నివున్నా-నీ సిగమల్లెలే కవ్వించగా

ఆమె : మొదటిరేయి మూగహాయి-ఎదలో ఇంకా పులకించగా
పిదపపిదప పెరిగిన మమత-వేయింతలుగా వికసించగా ॥ఏమని॥

చరణం :

అతడు : ఏ కలనైనా నీవేనీవే-నా కౌగిలిలో నిదురించగా
ఆమె : అన్నివేళలా నీవేనీవే-నా కన్నులలో నివసించగా. ॥ఏమని॥

---

## 73

పల్లవి :

అతడే నా జతగాడు -
కళలు మాయని నెలరేడు
కనువిందుచేసే పూలవిలుకాడు.

చరణం :

నెమలి అడుగులకు గతులు నేర్పేది
నీలమేఘమొకడేలే
రాధ మనసులో రాగాలు మీటేది
మాధవుడొకడేలే
నను పలికించేది—మైమరపించేది
నాస్వామి ఒకడే ఒకడేలే. ॥అతడే॥

చరణం :

ఆతనిరాక నా బ్రతుకులోన
కార్తీక చంద్రరేఖ
ఏమే చెలి అని నను పిలువగా విని
ఏమౌదునో మాటరాక
క్షణమే యుగముగ—మనసే కనులుగ
వేచేను అందాక అందాకా ॥అతడే॥

## 74

పల్లవి:

ఏ గాజుల సవ్వడి విన్నా-నీ నవ్వులే అనుకున్నా
ఏ అందెల సందడి విన్నా-నీ అడుగులే అనుకున్నా
నీ అడుగులే అనుకున్నా.

చరణం :

నీ చల్లని నవ్వులు సోకితే-మల్లెపూలకే తెల్లదనం
నీ సున్నని బుగ్గలు తాకితే-గులాబీలకే ఎర్రదనం
ఏ మబ్బు ముసిరినా-నీ వయసే అనుకున్నా
ఏ మెరుపు మెరిసినా-నీ సొగసే అనుకున్నా. ॥ఏ గాజుల॥

చరణం :

నీ వెన్నెల చూపులు విసిరితే-నా యెదలో వెచ్చదనం
నా తోడుగ నీవే సాగితే-బ్రతుకంతా పచ్చదనం
నీ నీలి కళ్ళలో-నా నీడ చూస్తున్నా
ఏనాటికైనా నీవే నాదానివనుకున్నా. ॥ఏ గాజుల॥

పల్లవి :

ఆమె : పుత్తడిబొమ్మా మా పెళ్ళి పడుచు
పున్నమిరేమ్మా మా పెళ్ళిపడుచు
ఆ బొమ్మకున్న ఆభరణం
అందాలకందని మంచిగుణం

అతడు : మహారాజు కాడు మా పెళ్ళికొడుకు
మనసైనవాడు మా పెళ్ళికొడుకు
మావాడికున్న వింతగుణం-తన
మాట తప్పని మంచితనం. ॥పుత్తడి॥

చరణం :

గళమునలేవు ఏ ముత్యాలసరాలు
ఉన్నవిలే హరినామస్వరాలు
కరమునలేవు ఏ బంగారు కడియాలు
ఉన్నవిలే శివపూజాకుసుమాలు
మదిలోలేవు సంపదలమీది ఆశలు
ఉన్నవిలే పతిసేవాకాంక్షలు
ఆ బొమ్మకున్న ఆభరణం
అందాలకందని మంచిగుణం. ॥పుత్తడి॥

చరణం :

పెళ్ళిళ్ళకు మధుమాసం చైత్రమాసం
వచ్చే చైత్రమాసం
పెళ్ళికొడుకు ఊఁ అంటే మాకు సంతోషం-
మరీమరీ సంతోషం

రాచిలుకల రప్పించు
మామిడి తోరణాలు కట్టించు
కోయిలలను పిలిపించు
మంగళవాద్యాలను తెప్పించు
ఆకాశమంత పందిరివేసి
భూలోకమంత పీటవేసి
పెళ్ళికొడుకును–పెళ్ళిపడుచును
పీటలమీద కూర్చోబెట్టి
శ్రీదేవి భూదేవి శ్రీవాణి శ్రీగౌరి
అందరూ చల్లగా-అక్షతలు చల్లగా
కళ్యాణం జరిపించాలి-ఆ వైభోగం తిలకించాలి ॥పుత్తడి॥

పల్లవి :

అతడు : మల్లెపూలు జడగోచుట్టి—ఉల్లిపూల చీరకట్టి
కళ్ళనిండా సిగ్గులుదాచిన—పెళ్ళిపడుచు ఎవ్వరో

ఆమె : అంకెవ్వరో
మల్లెపూల మమతలు చూపి—ఉల్లిపూల ఊహలు రేపి
పిల్లమనసును అల్లరిచేసెను—పెళ్ళికొడుకు ఎందుకో

చరణం :

అతడు : ఇంకెందుకో
తననవ్వులు నా ముంగిట రంగవల్లులై
తననడకలు అడుగడుగున పాలవెల్లులై
తానే ఒక సిరియై—తరగని పెన్నిధియై
పచ్చగ నా బ్రతుకున వెలసే—పసిడిబొమ్మ ఎవ్వరో

చరణం :

ఆమె : తన దీవన నా పాలిట పసుపుకుంకుమై
తన భావన అణువణువున ప్రాణదీపమై
తానే నా జగమై—తనలోనే సగమై
యుగయుగాలు తరియించాలని
చిగురు కలలు ఎందుకో.

పల్లవి :

నీటిచాటున సొగసు–దాచుకుందామంటే
గడసరి అలవచ్చి–ఒడలంతా తడిమింది
అమ్మమ్మమ్మమ్మో చక్కిలిగింత
ఏమైపోతానో నేనింక

చరణం :

ఆ మబ్బు అదోలా చూసింది నన్ను
ఈ కోన నాపైన వేసింది కన్ను
ఆ మబ్బా-ఈ కోనా–కసిబూనె నాపైన
ఇలాగే నేనుంటే ఏమౌనో ఇకపైన ॥నీటి॥

చరణం :

నా నీడ నన్నే చూసింది–చూసి
నడుమేదే నీకని అడిగింది
నా వయసు లోలో నవ్వింది–నవ్వి
నీ జంటా ఎవరని అడిగింది
ఏమని పలుకను– ఎవరికి తెలుపను
ఎగిసిపడే మనసుకే అ సంగతి తెలుసును. ॥నీటి॥

---

నిండు దంపతులు

పల్లవి :

అతడు: ప్రేమపక్షులం మనం ! ఎవ-
రేమన్నా ఇక వినం
మా-బాబు చెప్పినా-బ్రహ్మ చెప్పినా
ససేమిరా వినం—వినం

చరణం :
అతడు : గాలి అందుకుందామా ! మేఘాలు పిండుకుందామా
ఆమె : చుక్కలెక్కి చూదామా ! కైపెక్కి సోలిపోదామా
ఇద్దరు : జోడుగూడుకొని ! నీలినింగిలో
గూడు కట్టుకుందామా -హోయ్ ॥ప్రేమ॥

చరణం :
అతడు : ప్రేమ పండినదె భామా ! ఈ సీమ వదిలి పోదామా
ఆమె : ఒక్కసారి ఓ మామ ! స్వర్గానికెక్కి తొలి చూదామా
ఇద్దరు : చందమామలో-విందు చేసుకొని
తందనాలు ఆడేమా-హోయ్ ॥ప్రేమ॥

చరణం :
ఆమె : అలల నడిచి పోదామా ! ఈ-
జలధి కొలచి చూదామా
అతడు : పరవశించి పోదామా !
పాతాళగంగ చూదామా
ఇద్దరు : ఇసుక తిన్నెలో మిసిమిసివలపుతో
పసిడిమేడ కడదామా-హోయ్ ॥ప్రేమ॥

---

**ఆడపడుచు**

## 79

పల్లవి :

ప్రతి పుట్టినరోజు పండుగకాదు
ప్రతిరేయి వెన్నెల రాదు
వంచినవాడే కలిసినవాడే
వనితకు పండుగరోజు
అదే అసలైన పుట్టినరోజు.

చరణం :

చెలి కన్నుల రేఖలు చదువుకొని
తొలివలపుల బాసలు తెలుసుకొనీ
వలచినవాడే పిలచినవాడే
పెదవులు చిందును మధురిమలు
మదిలో మ్రోగును సరిగమలు ॥ప్రతి॥

చరణం :

ఒకరేయి మురిపెం చాలదనీ
ఒకనాటితో అది తీరదనీ
వలచినవాడే–ఎరిగినవాడే
తరగక నిలుచును అనురాగం
కలలో పండును కలకాలం. ॥ప్రతి॥

---

సాకీ :

అతడు : మేలుకో కవిరాజా ! మేలుకోవయ్యా !

పల్లవి :

అతడు : మేలుకో కవిరాజ ! మేలుకోవయ్యా !
మేలుకొని పద కవిత లేలుకోవయ్యా
పలుకుపలుకున జీవకళలు పులకించగా
పదముపదమున భావనదములు రహించగా

చరణం :

శృంగార రస ఝరీరంగత్తరంగ
రంగములపై నీ నుడుల గజ్జెలు ధ్వనించగా
అష్టవిధ నాయికల-అనురాగ చంద్రికల
మై సిరులు నీ వాణిలో సురభిళించగా
గంటమ్ము నందుకోవయ్యా-రాగరస
గంగలను పొంగించవయ్యా

పల్లవి :

ఆమె : ఎంతో చక్కని వన్నెకాడే-నా పైన
ఎంతో మక్కువ ఉన్నవాడే.

చరణం :

నా కురులూ తానే దువ్వేనే-చెంగల్వ
విరులూ తానే ముడుచునే
నా చెక్కిట కస్తూరిమకరికలు తీర్చునే
నా పుక్కిట కప్పురపువిడియమ్ము కూర్చునే

సాకి :

అతడు : తన పతిని చేల చెరగున ముడుచుకున్న-ఆ
అతివయే స్వాధీనపతిక

పల్లవి :

ఆమె : ఎంత టక్కరివాడు నా వాడే
ఎంతకు చెంతకు రానే రాడే

చరణం :

వెన్నెల సెగలాయె
విరులే పొగలాయె
అలదిన గంధము
ఆవిరి ఐపోయె
అదను దొరికెనని
మదనుడందుకొని
పదునుటమ్ములను
ఎదను గ్రుమ్మెనే ॥ఎంత॥

సాకి :

అతడు : స్మరశిలీముఖశిఖాజర్జరితగాత్ర-ఆ
తరుణి విరహోత్కంఠిత.

పల్లవి :

ఆమె : ఎంత ముచ్చటైనవాడే-నా ప్రియుడు
ఈ క్షణమే రానున్నాడే.
ఇదుగో పైటచెంగు తొందరపడెనే
అదుగదుగో పూలపాన్పు గుసగుసలిడెనే
అతని మెత్తని అడుగుల సడి
లేతగాలిలో వినపడి
అరెరే నా ఒడలంతా అలజడి
అలజడి అలజడి అలజడి.

:ఢక

అతడు : పడకిల్లు సరిచేసి పతికొరకు వేచేటి
వసతి వాసకసజ్జిక.

చరణం :

సన్నమావి గుబురింట కలుసుకో
మన్న చెలుడు తనజంట లేడని
కొసరి కొసరి కని
విసరి విసరికొని
కుసుమ మాలికలు
విసిరివేసి చని
శోకదిగ్ధయై కోపదగ్ధయై
విలవిలలాడే విముగ్ధ
విభువంచిత విప్రలబ్ధ-విప్రలబ్ధ

పల్లవి :

ఆమె : ఎంత వింత వగకాడే నా మగడు
ఎంతకైన తగినవాడే హొంతకాడే

చరణం :

చేటుచేతలకు తెగ మరిగినాడే
సిగ్గు ఎగ్గూ దిగ త్రావినాడే
చెణికినా కదలడే
గెంటినా వదలడే ॥ఎంత॥

అయ్యో ఏమి చేసితినమ్మా-విభుని
ఏల దూరితినమ్మా.

సాకి :

అతడు : మొదట కలహించి
పిదప విలపించి
తుదకు తపియించు
ఆ నెలత కలహాంతరిత-కలహాంతరిత.

పల్లవి :

ఆమె : ఎంత తెంపరికాడవురా-నీవు
ఎన్ని నేర్చినాడవురా

చరణం :

ఎక్కడివి—అవి
ఎవ్వరివి ?
చక్కెర తీయని
చిక్కని మోవిని
నొక్కులు ఎక్కడివి ? పలు
నొక్కులు ఎక్కడివి ? ॥ఎంత॥

చరణం :

చేతులకు-నును చెంపలకు—ఆ
పూతలు ఎవ్వరివి ? గంధం
పూతలు ఎవ్వరివి ?
ఔరా ఈ చిన్నెలతో ఉడికింపకు
హోహోరా ఆ జంపుల మారి కొంపకు

సాకి :

అతడు : అన్యకాంతను మరగి
అరుగుదెంచిన మగని
సదలించు ఆ ముదిత ఖండిత-ఖండిత.

పల్లవి:

ఎంత చల్లనివాడే నా రేడు—అత
డింటలేని గడియలే యుగములేడు

చరణం :

ఓ మెరుపులారా ! మిడిసిపడేరా
ఓ మబ్బులారా ! ఉరిమిపడేరా
నా రాజు సందిట
నే నున్న మీదట
మీరు చెదిరి పోతారే
నీరు నీరవుతారే ॥ఎంత॥

సాకి :

అతడు ప్రవాసమున ప్రియుడుండగ
స్వవాసమున రేబవళ్ళు
వొగిలిపోవు నాయిక ప్రోషితభర్తృక.

చరణం :

అడుగులోన తన అడుగిడి తడబడి
అలతి అలికిడికి ఉలికిఉలికిపడి
వెసలు తిలకించి
ముసుగు సవరించి
ముసురు ముంగురుల
కొసలు తొలగించి
విరి వెన్నెలలో
సిరి వెన్నెలయై
పెనుచీకటిలో
నునుచీకటియై
ఆత్మ విభునికై అన్వేషించే
ఆ నాయిక అభిసారిక.

# 81

పల్లవి:

పగలే వెన్నెల-జగమే ఊయెల
కదలే ఊహలకే కన్నులుంటే.

చరణం :

నింగిలోన చందమామ-తొంగిచూచె
నీటిలోన కలువభామ-పొంగిపూచె
ఈ యనురాగమే జీవనరాగమై
ఎదలో తేనెజల్లు కురిసిపోదా ॥పగలే॥

చరణం :

కడలి పిలువ కన్నెవాగు-పరుగుదీసె
మురళిపాట విన్న నాగు-శిరసునూపె
ఈ యనుబంధమే మధురానందమై
ఇలపై నందనాలు నిలిపిపోదా. ॥పగలే॥

చరణం :

నీలిమబ్బునీడలేచి-నెమలి ఆడె
పూలఋతువు సైగచూచి-పికముపాడె
మనసే వీణగా-ఝుణఝుణ మ్రోయగా
బ్రతుకే పున్నమిగా-విరిసిపోదా. ॥పగలే॥

పల్లవి

నిన్నలేని అందమేదో-నిదురలేచెనెందుకో
నిదురలేచెనెందుకో
తెలియరాని రాగమేదో-తీగసాగె నెందుకో
తీగసాగె నెందుకో

చరణం :

పూచిన ప్రతి తరువొక వధువు
పువ్వుపువ్వున పొంగెను మధువు
ఇన్నాళ్ళీ శోభలన్నీ [illegible]
ఎచట దాగెనో ॥నిన్నలేని॥

చరణం :

తెలినురుగులె నవ్వులు కాగా
సెలయేరులు కులుకుచురాగా
కనిపించని వీణలేవో
కదలి మ్రోగెనే. ॥నిన్నలేని॥

చరణం :

పసిడియంచు పైటజార
పయనించే మేఘబాల
అరుణకాంతి సోకగానే
పరవశించెనే. ॥నిన్నలేని॥

పల్లవి :

అతడు : కృష్ణవేణీ-కృష్ణవేణీ
కృష్ణవేణీ-కృష్ణవేణీ.

ఆమె : కృష్ణవేణీ-తెలుగింటి విరిబోణి

అతడు : కృష్ణవేణీ-నాయింటి అలివేణీ.

చరణం :

ఆమె : శ్రీగిరిలోయల-సాగే జాడల
విద్యుల్లతలు కోటి-వికసింపజేసేవు

అతడు : లావణ్యలతవై-నను చేరువేళ
శతకోటి చంద్రికలు-వెలిగించు కృష్ణవేణి. ॥కృష్ణ॥

చరణం :

ఆమె : నాగార్జునగిరి-కౌగిట అగీ
బీళ్ళను బంగారుచేలుగా మార్చేవు
ఆంధ్రావనికే అన్నపూర్ణవై
కరువులు బాపేవు-బ్రతుకులు నిలిపేవు

చరణం :

నా జీవనదివై-ఎదలోన ఒదిగే
పచ్చని వలపులు-పండించు కృష్ణవేణి ॥కృష్ణ॥

చరణం :

ఆమె : అమరావతి గుడి-అడుగుల నడయాడి
రాళ్ళను అందాల-రమణులుగ తీర్చేవు.

అతడు : ఏ శిల్ప రమణులు-ఏ దివ్యలలనలు
నోచని అందాలు-దాచిన కృష్ణవేణి. ॥కృష్ణ॥

ఆమె : అభిసారికవై-హంసల దీవిలో
సాగర హృదయాన-సంగమించేవు.

అతడు : నా మేని సగమై-నా ప్రాణ సుధవై
నిఖిలము నీవై-నిలచిన కృష్ణవేణి. ॥కృష్ణ॥

## 84

పల్లవి :

ఎగిరే గువ్వ ఏమంది ?
విసిరే గాలి ఏమంది ?
ప్రకృతిలోన స్వేచ్ఛకన్న
మిన్నలేనేలేదంది.

చరణం :

పూలకెందుకు కలిగెనే
ఈ ఘుమఘుమలు-ఈ మధురిమలు
తీగలెన్నడు నేర్చెనే
ఈ అల్లికలు-ఈ అమరికలు
స్వేచ్ఛకోరే మనసువుంటే
పొందలేనిది యేముంది ! ॥ఎగిరే॥

చరణం :

కోకిలెన్నడు నేర్చెనే
ఈ సరిగమలు-సరాగములు
నెమలికెవ్వరు నేర్పిరే
ఈ లయగతులు-ఈ స్వరజతులు
స్వేచ్ఛకోరే మనసువుంటే
నేర్వలేనిది యేముంది. ॥ఎగిరే॥

చరణం :

శిరసువంచక నిలువనా
గుడిగోపురమై-గిరిశిఖరమునై
అవధులన్నీ దాటనా
ప్రభంజనమై-జలపాతమునై
స్వేచ్ఛకోరే మనసు నాది
ఇంక నాకెదురేముంది. ॥ఎగిరే॥

---

## 85

పల్లవి:

ముద్దబంతిపువ్వు—ఓయ్ భామల్లారా !
ముసుగులేని నవ్వు—ఓయ్ భామల్లారా !
ముల్లు లేనిది—ఓయ్ భామల్లారా !
సోకు లేనిది— నాజూకు లేనిది.

చరణం :

పచ్చని పెరడమ్మ కడుపార కన్నది
చల్లని గొబ్బెమ్మ సిగలోన ఉన్నది
ప్రతి తెలుగింటికి సిరులను పంచేది.
ప్రతి సంక్రాంతిశోభను పెంచేది ॥ముద్ద॥

చరణం :

పసుపు పూయకనే పూసినట్టుండు
పసిడిలో జలకాలాడినట్టుండు
ముత్తైదువులా ముంగిట నిలుచుండు
ఉన్నంతకాలం ఊరంత తానుండు

చరణం :

జడి వానలకు జడిసిపోనిది
మండుటెండలకు మాడిపోనిది
తుంటరి గాలికి రాలిపోనిది
తుంచినా అల్లాడిపోనిది
తొందరపడి అది వాడిపోనిది. ॥ముద్ద॥

పల్లవి :

తొలికోడి కూసింది—తెలతెల వారింది
వెలుగులలో జగమంతా—జలకాలాడింది

చరణం.

దూరాల ఆకాశ తీరాల బంగారు
హారాలు వేసెను కిరణాలు
ఈ వేళ విరిసే భావాల మెరిసే
శ్రీ వెంకటేశుని చరణాలు.

చరణం

అనురాగపల్లి ఆ తీగతల్లి
అలరారె తన పూలపాపలతో
తొలిచూరులేగ— తల వూపిరాగా
పులకించె గోమాత చేపులతో. ॥తొలి॥

తిక్క– శంకరయ్య

# 87

పల్లవి :

ఆమె : కొండపైన...

వెండివాన...

అతడు : అది గుండెల్లో కొత్తవలపు కురిపించాలి

ఆమె : ఆ కొత్తవలపు కోరికలను పండించాలి.

చరణం :

అతడు : మబ్బులు వస్తూ పోతుంటాయి

నిలిచె దాకటే - నీలాకాశం

ఆమె : కలతలు వస్తూ పోతుంటాయి

మిగిలే దాకటే - వలచే హృదయం

అతడు : కన్నీళ్ళలో-కలకల నవ్వి

కలహాలలో - చెలిమిని పెంచి

ఇద్దరు : కలలాగా బ్రతుకంతా జీవించాలి ॥కొండ॥

చరణం :

ఆమె : నిప్పులు చెరిగే వేసవితోనే

తేనెలు కురిసే-వానొస్తుంది

అతడు : ఆకులురాల్చే కాలంతోనే

చిగురులు తొడిగే-గడియొస్తుంది

ఆమె : అనురాగమే తీయని వరమై

ఆనందమే తరగని సిరియై

ఇద్దరు : కలకాలం కాపురం సాగించాలి ॥కొండ॥

---

## 88

పల్లవి :

పూలోయమ్మ-మల్లె
పూలోయమ్మ-గులాబీ
పూలోయమ్మ
సీతాల జడలోన
పూలే అందాలు.

చరణం :

తొలిపొద్దు తెలిమంచులో
తడిసిన పూలు
చిగురాకు సునువేళ్ళతో
చిదిమిన పూలు
తొణకని వలపుల
మాతలు ఈపూలు ॥పూలో॥

చరణం :

ఏకొంటె కనుసైగలూ
ఎరగని పూలు
తనతల్లి ఒడినెన్నడూ
దాటని పూలు
మాయలు తెలియని
మనసులు ఈపూలు ॥పూలో॥

చరణం :

పసిపాప చిరునవ్వులా
విరిసే పూలు
పడుచుపిల్ల తొలిసిగ్గులా
మెరిసే పూలు
దేవుని పదముల
దివ్వెలు యీా పూలు ॥పూలో॥

---

బంగారుమనసులు

## 89

పల్లవి :

ఆమె : ఉదయ కిరణాలలోన—నా
హృదయాన కదలాడె నవరాగవీణ

చరణం :

పసరాకులపై కురిసే వెలుగులు
కొసతీవెలపై విరిసే వెలుగులు
మలయ శిఖరాల అంచుల మెరిసీ
నాలో పొంగారు బంగారు వెలుగులు ॥ఉదయ॥

చరణం :

జగమే కమలమై వికసించినది
మనసే భ్రమరమై రవళించినది
ఆ భగవానుని ఆరని కలలే
అణువూ అణువున పులకించినవి ॥ఉదయ॥

## 90

పల్లవి :

ఈ నల్లని రాలలో
ఏ కన్నులు దాగెనో
ఈ బండల మాటునా
ఏ గుండెలు మ్రోగెనో

చరణం :

పాపాలకు తాపాలకు
బహుదూరములో నున్నవి
మునులవోలె కారడవుల
మూలలందు పడియున్నవి ॥ఈ నల్లని॥

చరణం :

కదలలేవు మెదలలేవు
పెదవివిప్పి పలుకలేవు
ఉలియలికిడి విన్నంతనే
జలజలమని పొంగిపొరలు ॥ఈ నల్లని॥

చరణం :

పైన కఠినమనిపించును
లోన వెన్న కనిపించును
జీవమున్న మనిషికన్న
శిలలే నయమనిపించును ॥ఈ నల్లని॥

---

అమరశిల్పి జక్కన

## 91

సాకి :

చరణకింకిణులు ఘల్లుఘల్లుమన
కరకంకణములు గలగలలాడగ
అడుగులందు కలహంసలాడగ
నడుములో తరంగమ్ములూగగా
వినీలకచభరవిలాసబంధుర
తనూలతిక చంచలించిపోగా

పల్లవి :

ఆడవే మయూరీ! నటన
మాడవే మయూరీ!
నీ కులుకును గని—నా పలుకు విరియ
నీ నటనను గని—నవ కవిత వెలయగా

చరణం :

అది యమునాసుందరతీరము
అది రమణీయబృందావనము
అది విరిసిన పున్నమివెన్నెల
అది వీచిన తెమ్మెరఊయల
అది చల్లని సైకతవేదిక
అట సాగెను విరహిణి రాధిక
అది రాధమనసులో మాధవుడూదిన
రసమయ మురళీగీతిక.
ఆడవే మయూరీ! నటన
మాడవే మయూరీ!
నా పలుకుల కెనయగు కులుకుచూపి
నా కవితకు సరియగు నటనచూపి—ఇక
ఆడవే మయూరీ! నటన
మాడవే మయూరీ!

చరణం :

ఫాలనేత్ర సంప్రభవత్ జ్వాలలు
ప్రసవశరుని దహియింపగా
పతినికోలుపడి రతీదేవి-దుః
ఖితమతియై రోదించగా
హిమగిరీంద్రశిఖరాగ్రతాండవత్
ప్రమథగణము కనిపించగా
ప్రముథనాథకరపంకజాంకృత
డమరుధ్వని వినిపించగా
ప్రళయకాలసంకలితభయంకర
జలధరార్భటుల-చలితదిక్తటుల
చకిత దిక్కరుల-వికృత ఘీంకృతుల
సహస్రఫణసంజనితఫూత్కృతుల
కనులలోన-కనుబొమలలోన
అధరమ్ములోన-వదనమ్ములోన
గళసీమలోన-కటిసీమలోన
కరయుగములోన-పదయుగములోన
నీ తనువులోని అణువణువులోన-
అనంత విధముల అభినయించి-ఇక
ఆడవే-ఆడవే-ఆడవే.

పల్లవి :

శివరంజనీ !
నవరాగిణీ !
వినినంతనే-నా
తనువులోని
అణువణువు కరిగించే
అమృతవాహినీ.

చరణం :

రాగాల సిగలోన సిరిమల్లివి
సంగీతగగనాన జాబిల్లివి
స్వరసురఝురీతరంగానివి
సరస హృదయవీణా వాణివి. ॥శివరంజనీ॥

చరణం :

ఆ కనులు పండువెన్నెలగనులు
ఆ కురులు ఇంద్రనీలాల వనులు
ఆ వదనం అరుణోదయకమలం
ఆ అధరం సుమధురమధుకలశం ॥శివరంజనీ॥

చరణం :

జనకుని కొలువున అల్లనసాగే
జగన్మోహినీ జానకీ !

వేణుధరుని రథమారోహించిన
విదుషీమణి రుక్మిణీ !
రాశీకృత నవరసమయ జీవన
రాగచంద్రికా !
లలితలావణ్య భయద సౌందర్య
కలితచండికా !
రావేరావే నా శివరంజనీ !
మనోరంజనీ !
రంజనీ ! నా రంజనీ !
నీవేనీవే నాలో పలికే నాదానివి
నీవే నాదానివి
నాదానివి నాదానివి నీవే నాదానివి

## 93

పల్లవి :

నా పేరు సెలయేరు
నన్నెవ్వరాపలేరు
తడియారని వలపులతో
తరలి పొరలి తిరిగేను.

చరణం :

ఎంతటి శిలకైనా
గిలిగింతలు నలిపేను
ఎంతటి మునికైనా
నా చెంతకు లాగేను
నా తనువు నిలువగొకచోట
నా మనసు చూపినదే బాట ॥నా పేరు॥

చరణం :

నా గలగల నడకలతో—శ్రుతి
కలపని వారెవరు ?
నా కలకల నవ్వులతో—మది
కరగని వారెవరు ?
నా పైన మరులు గొనువారు
ఆ పైన తిరిగి పోలేరు. ॥నా పేరు॥

---

# 94

పల్లవి:

మనసైన నా స్వామి రాడేలనే-నా
మదిలోని నెలరాజు రేడేలనే

చరణం :

జిలిబిలి నవ్వులు-చిలికినవాడే
వలపే తానై-పిలిచిన వాడే
నంద కిశోరుడే-నా వగకాడే
వేణుగానసఝరిలోన ముంచెనే
నితాంతలతాంతవసంతవేళల
మరులు గొలిపినాడే
మరచినాడే-దరికిరాడే-మగువరో. ॥మనసైన॥

చరణం :

అల్లరిగాలి-చల్లగవీచె
సిగలో పూలే-నగవులుదాచె
విరివిలుకాడే-తరుణము వేచె
పొంచిపొంచి పులకించి మించి
బిరబిరాన వరాలశరాలు దూసె
కలలబరువు పెరిగె
నిదుర తరిగె-రేయి కరిగె-చెలియరో. ॥మనసైన॥

## 95

పల్లవి :

ఎప్పటివలె కాదురా ! స్వామీ !
ఎప్పటివలె కాదురా !
ఈ ముద్దు మురిపెము
ఏ పొద్దు ఎరుగవులేరా !
ఎప్పటివలె కాదురా-నా స్వామీ !
ఎప్పటివలె కాదురా !

చరణం

పున్నమి కళలన్ని-మోమున ముడిచి
అమృత మాధురులు-అధరాన దాచి
నిన్నలేని రమణీయరూపనవ
నీత కాంతితో వున్నానురా
అభినయం నాదిరా ! అనుభవం నీదిరా !
కులుకులుకులో పలుకుపలుకులో
లలితరాగములు చిలుకరింతురా ॥ఎప్ప॥

చరణం

పదును చూపుతో-మదనుని కవ్వించి
చిరు నగవులతో-పగలను రగిలించి
అందలేని ఆనందలోకనవ
నందనాల తేలించేనురా
లాలనం నాదిరా ! పాలనం నీదిరా !
వసంతవేళల రసైకలీలల
నిశాంతముల పరవశించేమురా ॥ఎప్ప॥

# 96

పల్లవి :

పూజకు వేళాయెరా ! రంగ
పూజకు వేళాయెరా
ఇన్నాళ్లుగ నేనెటుల వేచితినా
ఇన్ని రేలు ఎంతెంత వేగితినా
పిలుపునువిని-విచ్చేసితివని, నా
వలపులన్ని-నీకొరకె దాచితిని
ఎవరూ పొందని ఏకాంత సేవలో
ఈవేళ తమిదీరగా నిన్నె అలరించు.

చరణం :

ఈ నీలినీలి ముంగురులు
ఇంద్రనీలాల మంజరులు
ఈ వికసితసితనయనాలు
శతదళకోమలకమలాలు
అరుణారుణమీ అధరము
తరుణ మందార పల్లవము
ఎదలో పొంగిన
ఈ రమణీయ పయోధరాలు
పాలకడలిలో
ఉదయించు సుధాకలశాలు
ఎంత సుందరము
శిల్పబంధురము
ఈ జఘనమండలము
సృష్టినంతటిని దాచుకున్న
పృథివీమండలము. ॥పూజకు॥

అతడు : ఓ అభినవసౌందర్యరాశీ !

ఓ అపూర్వచాతుర్యమూర్తీ !

నీ కటాక్షముల లాలనమ్ములో-

నీ మధురాధరచుంబనమ్ములో-

మధురిమలెన్నో పొదుగుకున్న నీ

స్తన్యసుధల ఆస్వాదనమ్ములో-

అప్రమేయదివ్యానందాలను

అందించే నీ చల్లని ఒడిలో-

హాయిగా నిదురించే-

పాపగా నీ కడుపున జన్మించే

భాగ్యమేలేదాయె తల్లీ! తల్లీ ! తల్లీ !

దువ్వుకున్న ఆ నీలిముంగురులె

దూదిపింజలై పోవునులే-

నవ్వుతున్న ఆ కంటివెలుగులే

దివ్వెలవోలిక ఆరునులే-

వన్నెలొలుకు ఆ చిగురు పెదవులే

వాడి వత్తులై పోవునులే

పాలుపొంగు ఆ కలశాలే

తోలుతిత్తులై పోవునులే

నడుము వంగగా - నీ

ఒడలు క్రుంగగా-

నడువలేని - నీ

బడుగు జీవితము

వడవడ వణకునులే

ఆశలు రేపే సుందరదేహము

అస్థిపంజర మౌనులే !!!

---

# 97

పల్లవి :

జోహారు ! శిఖిపింఛమౌళీ ! ఇదె
జోహారు ! రసరమ్యగుణశాలి ! వనమాలి !

చరణం :

కలికి చూపులతోనె - చెలులను కరగించి
కరకు చూపులతోనె-అరులను జడిపించి
నయగారమొకకంట-జయవీరమొకకంట
చిలకరించి-చెలువుమించి నిలిచిన
శ్రీకరా ! నరవరా ! సిరిదొరా ! ! ॥జోహారు॥

చరణం :

నీ నాదలహరిలో-నిదురించు భువనాలు
నీ నాట్యకేళిలో-నినదించు గగనాలు
నిగమాలకే నీవు-నిగబంతివై నావు
యుగయుగాల దివ్యలీల నెరపిన
అవతారమూర్తీ ! ఘనసారకీర్తీ ! ॥జోహారు॥

చరణం :

చకితచకితహరిణేక్షణావదన
చంద్రకాంతులివిగో !
చలితలలితరమణీచేలాంచల
చామరమ్ము లివిగో !
ఝళంఝుళితసురలలనానూపుర
కలవరమ్ములివిగో ! మధు
కరరవమ్ములివిగో ! మం
గళరవమ్ములివిగో !
దిగంతముల అనంతముగ గుబాళించు
సుందరనందనసుమమ్ములివిగో ! ॥జోహారు॥

## 98

పల్లవి :

ఎవ్వడు నిను మించువాడు ?
ఈరేడులోకాల ఎందైన కనరాడు.

చరణం :

మదనుడవని అందునా-వాడు
మాడిపోయిన వన్నెకాడు-చూడరూపమైనా లేనివాడు
ఇంద్రుడవని యందునా-వాడు
ఒడలెల్ల పొడలున్నవాడు-నీ కొడుకన్న హడలున్నవాడు
ధననిధివని యందునా-వాడు
నినుకొలిచే బానిసీడు-నీ ముంగిట పడియున్నవాడు
నరసురకిన్నరగరుడులలో-నీ
సరితూగురేడు మచ్చునకైన లేడు ॥ఎవ్వడు॥

చరణం :

ఓరచూపే చాలురా-అది
కుసుమాంగులకు జ్వాలరా
మిసిమి నవ్వే చాలురా-అది
రసవాహినుల డోలరా
మగువల కెరలించు-మగసిరి నీదేరా
పగలను రగిలించు-సొగసులు నీవేరా
అసమానరమ్యరసికావతంస !
అసురవంశసరసిరాజహంస !

చరణం :

నిజభుజ కంపిత రజతాచలాగ్రశేఖరా ! సురభీకరా !
అసదృశవిక్రమచకచ్చకిత విషకంధరా ! దశకంధరా !
రాజ్యరమాభాగ్యరమావిజయరమారమణా !
అస్త్రశస్త్రగదాఖడ్గ సుప్రయోగ నిపుణా !
అనంతమూర్తీ ! దిగంత కీర్తీ
విజయా ! సదయా !
అజరా ! అమరా ! ॥ఎవ్వడు॥

## 99

పల్లవి :

నీజాడ కనానైతిరా! స్వామీ!
నీజాడ కననైతిరా!
దోర వెన్నెలలారె
తూరుపు తెలవారె.

చరణం :

చేతిలో చెయి వేసి-చిరునవ్వులుదూసి
చేసినబాసలు ఏమాయెరా
నీకోసమై వేచి జామాయెరా
బేలపైన ఏల ఇంతబిగువురా
పూలపైన రాలవాన తగదురా ॥నీజాడ॥

చరణం :

వెన్నెల నాకేమో-వేడిగ తోచెనురా
తెమ్మెర బరువై వీచెనురా
మదనుడు ఇదె మంచి-అదనని గమనించి
మదిలో మంటలు కురిసెనురా
ఈ బాధ ఏలాగు సైచేనురా
బేలపైన ఏలయింత బిగువురా
పూలపైన రాలవాన తగదురా ॥నీజాడ॥

---

పెంపుడు కూతురు

## 100

సాకి :

ఇన్నాళ్ళులేని వేగిరపాటు
ఇవుడేలరా ! ఏలినదొరా !
పన్నీటపాదాలు కడిగేనురా.

పల్లవి :

మునినవ్వు వెల్గులోన
కొనచూపు నీడలోన
చెమరింపు సైపలేని
చినదానరా

చరణం :

కనుపాప మేడలోన
నిను దాచుకొన్నదాన
వగకాడ నీకే—నా
వయసమ్ముకొన్నదాన
నీ తోడు లేనినాడు
నిదురే రాదురా
పాన్పుపై మల్లెలన్నీ
పల్లేరు లాయెరా ॥ముని॥

చరణం :

కలలోన నిన్ను చూచి
అలవోలె పైకిలేచి
కౌగింట చేరగానే
కరిగిపోయావురా
ఈ సంగనాచితనము
ఇక సాగబోదురా
అందాల వాలుజడతో
బంధించి వేతురా ॥ముని॥

---

పదండి ముందుకు

# 101

పల్లవి :

కన్నియనుడికించ తగునా ! భ్రమరా !
అన్నెము పున్నెము ఎరుగని-కలువల
కన్నియనుడికించ తగునా !

చరణం :

తీవియఒడిలో ఒదిగినది
తేనెలు ఎదలో పొదిగినది
రేకులు విరిసీవిరియనిది
ఏ కన్నుసైగల బాస లెరుగనిది ॥కన్నియ॥

చరణం :

గాలి సోకగా-కలవర పడురా
అలలు కదలగా—చెలివులికి పడురా
అల చందమామను-తిలకించగానే
నిలువెల్ల తొలిసిగ్గు గిలిగింత లిడురా ॥కన్నియ॥

చరణం :

మనసార పిలిచే పిలుపే పిలుపు
మనువులు కలిసే వలపే వలపు
వలపులేని పరువపుసయ్యాటలు
సెలయేటికెరటాల నురుగులమూటలు. ॥కన్నియ॥

# 102

పల్లవి :

సరిలేరు నీకెవ్వరు-నరపాలసుధాకర !
సరిలేరు నీకెవ్వరు
సురవైభవాన-భా
సురకీర్తిలోన
సరిలేరునీకెవ్వరు-రతిరాజసుందరా !
సరిలేరు నీకెవ్వరు
సిరిలోన గానీ-మగ
సిరిలోన గానీ

చరణం :

ప్రజలను నీ కంటిపాపలుగాకాచి
పరరాజు లదరంగ-కరవాలమును దూసి
శాంతిని వెలయించి-మంచిని వెలగించి
జగతిని లాలించి—పాలించినావు ॥సరి॥

చరణం :

మరుడే తొందరచేయ-విరిబోణులను గూడి
మధువే పొంగులు వార-మనసార తూగాడి
నవ్వులు చిలికించి-మువ్వలు పలికించి
యవ్వనవీణలు-కవ్వించినావు. ॥సరి॥

చరణం :

రాజభోజ ! రవితేజ ! దానజితకల్పభూజ ! జోహార్ !
నీటగుల్కి సుమకోటి తేనెలానేటి తేటి ! జోహార్ !
అసమప్రభావ ! జోహార్ !
రసికావతంస ! జోహార్ !
జోహార్ ! జోహార్ ! ॥సరి॥

---

పల్లవి :

కృష్ణా !
నీ పేరు తలచినచాలు - మది
లో పొంగు శతకోటియమునాతరంగాలు !

చరణం :

ఏమి మురళి అది ! ఏమి రవళిరా !
పాట వినగ ప్రాణాలు కదలురా !
మురళీధర ! నీ స్వరలహరులలో
మరణమైన మధురమురా ! ॥నీ పేరు॥

చరణం :

వెదురుపొదలలో తిరిగి తిరిగి - నీ
పదపల్లవములు కందిపోయెనో
ఎదపానుపుపై పవళించరా - నా
పొదిగిన కౌగిట పులకించరా ! ॥నీ పేరు॥

చరణం :

గోపాలా ! నందబాలా !
నవమంజులమురళీలోలా !
మృదుసమీరకంపిత
మనోజ్ఞకుంతలతమాలపల్లవజాలా !
ఏమి పిలుపు ! అది యేమి పిలుపు !
బృందానికుంజముల పూలుపూచి
శరదిందుచంద్రికలకేలుసాచి
తరుణాంతరంగముల దాగి దాగి
చెలిఅందెలందు చెలరేగిరేగి
నను తొందరించెరా ! తొలకరించెరా !
వలపుజల్లుగా పలుకరించెరా !
వల్లవీరమణి చల్లని ఉల్లము
అల్లన ఝల్లన పరవశించెరా ! ॥నీ పేరు॥

## 104

పల్లవి :

శరణన్నవారిని కరుణించే
తిరుమలవాసా ! జగదీశా !
చల్లని నీ చూపే - చాలును స్వామీ !
సురుచిరసుందరదరహాసా !
తిరుమలవాసా ! జగదీశా !

చరణం :

అందరు నీ కనుపాపలెకాదా !
ఈ దీనులపై నీ దయరాదా
ఇలవేలుపువై వెలసినదేవా !
ఈ యింటి చీకటి తొలగించరావా
తిరుమలవాసా ! జగదీశా ! ॥తిరు॥

చరణం :

ఏ సిరులూకోరి - నిను కొలువలేదు,
ఏ వరములు మేము - ఆశించలేదు
చింతలు కసరాని - కన్నీరేలేని
బ్రతుకుంటేచాలు - అదేపదివేలు
తిరుమలవాసా ! జగదీశా ! ॥తిరు॥

## 105

పల్లవి :

అణువూఅణువున వెలసినదేవా !
కనువెలుగై మము నడిపించరావా !

చరణం :

మనిషిని మనిషే కరిచేవేళ
ద్వేషం విషమై కురిసేవేళ
నిప్పులు మింగి-నిజమును తెలిపి
చల్లని మమతల సుధలనుచిలికి
అమరజీవులై వెలిగినమూర్తుల
అమృతగుణం మా కందించరావా ||అణువు||

చరణం :

జాతికిగ్రహణం పట్టినవేళ
మాతృభూమి మొర పెట్టినవేళ
స్వరాజ్యసమరం సాగించీ
స్వాతంత్ర్యఫలమును సాధించీ
ధన్యచరితులై వెలిగిన మూర్తుల
త్యాగనిరతి మా కందించరావా ||అణువు||

చరణం :

వ్యాధులు బాధలు ముసిరేవేళ
మృత్యువు కోరలు సాచేవేళ
గుండెకు బదులుగ గుండెనుపొదిగి
కొనవూపిరులకు వూపిరిలూది
జీవనదాతలై వెలిగినమూర్తుల
సేవాగుణం మా కందించరావా ||అణువు||

## 106

పల్లవి :

గానమే ప్రాణమై
మౌనమే ధ్యానమై
రాధ ఎన్నాళ్ళుగా వేచెనో
మోయలేని ఆ మూగబాధ
ఏ రీతిగా దాచెనో.

చరణం :

ఏ చల్లనిగాలి మెయితాకినా
ఏ పిల్లనగ్రోవి చెవిసోకినా
గోపకిశోరుని గుసగుసలనుకొని
మేనుపొంగ తిలకించును-అతడు
కానరాక విలపించును !

చరణం :

ఎవనిస్మరణలో భువనమెల్ల
బృందావనిగా భావించెనో
ఎవని చరణసరసీజధూళి
సిందూరముగా ధరియించెనో
ఆ స్వామి అగుపించగా-తన
అణువుఅణువు చిగురించగా
రాధకనులలో ఎన్నిపూర్ణిమలు పూయునో-ఆ
రమణిగుండెలో ఎన్ని యమునలుపొంగునో
మాధవుపదముల మల్లికయై ప్రణమిల్లునో

తల్లీ కూతుళ్లు

## 107

పల్లవి :

ఆమె : నీ చరణకమలాల నీడయేచాలు
ఎందుకోయీ స్వామి ! బృందావనాలు

అతడు : నీ నయనకమలాల—నే నున్నచాలు
ఎందుకే ఓ దేవి ! నందనవనాలు

చరణం :

ఆమె : నునుమోవిచివురుపై
నను మురళిగా మలచి
పలికించరా—మధువులొలికించరా

అతడు : మోవిపై కనరాని-మురళిలో వినలేని
రాగాలు పలికింతునే-మధురాను
రాగాలు చిలికింతునే

చరణం :

ఆమె : నీ ప్రణయవనిలోన-నేనున్నచాలు
ఎందుకోయీస్వామి ! నందనవనాలు

అతడు : నీ హృదయగగనాన-నేనున్నచాలు
ఎందుకే ఓ దేవి ! బృందావనాలు

చరణం :

ఆమె : తులసీదళాలలో-తొలివలపులందించి
పూజింతునా స్వామీ ! పులకింతునా

అతడు : పూజలను గ్రహియించి-పులకింతలందించి
లోలోన రవళింతునే-ఓ దేవి !
నీలోన నివసింతునే !

ఆమె : నీ చరణకమలాల నీడయేచాలు
ఎందుకోయీ స్వామి ! బృందావనాలు

అతడు : నీ నయనకమలాల-నే నున్నచాలు
ఎందుకే ఓ దేవి ! నందనవనాలు

ఆమె : నీ ప్రణయవనిలోన-నేనున్నచాలు
ఎందుకోయీ స్వామి ! నందన వనాలు.

## 108

పల్లవి :

వందే జననీ !
వందే సుధావాహినీ !
వందే కలుషహారిణీ !
వందే కళ్యాణకారిణీ !
వాణీ ! పావనీ !
శ్రీవాణీ ! పావనీ
కలవీణామృదుపాణీ !
అలివేణీ ! అజురాణీ !
వాణీ ! పావనీ ! శ్రీవాణీ ! పావనీ !

చరణం :

కమలాసనకమనీయహృదయనవ
కమలకర్ణికావాసినీ !
సకలచరాచరనిఖిలనరామర
చైతన్యకళాదాయినీ !
శుభకరకవితారూపిణీ !
అభినవకవితాదీపినీ !
వాణీ ! పావనీ ! శ్రీవాణీ ! పావనీ !

చరణం :

చందనశీతలమందమందమక
రందమధురసంభాషిణీ !
నవ్యదివ్యసంగీతసాహితీ
నయనయుగళసంశోభినీ !
రాజసతామసభంజనీ !
రసమయమానసరంజనీ !
వాణీ ! పావనీ ! శ్రీ వాణీ ! పావనీ !

## 109

పల్లవి :

ఓరామా ! శ్రీరామా !
నీ నామమొకటే నిత్యంరా
నీ రూపమొకటే సత్యంరా
నిలువదు నిలువదు ఈ కాయం-ఇది
మరు నిమిషంలో మటుమాయం

చరణం :

తనవారెవరో-పెరవారెవరో
తనువురాలితే-తదుపరిఎవరో
ఉన్నంతకాలం-ఎంతెంత మోహం !
ఎన్నడు తీరునో-ఈ వింతదాహం ॥నీ రామ॥

చరణం :

ఇల్లు మిగలదు-ఇల్లాలు మిగలదు
నాదనుకున్నది-ఏదీ మిగలదు ;
చివరకు మిగిలేది-చేసినపుణ్యం
అది చేయగలిగిన బ్రతుకేధన్యం ! ॥నీ నామ॥

చరణం :

కలిమిలేములూ-వెలుగునీడలూ
హోరుగాలిలో-ఊగే ఓడలు
కడలి దాటితే-తన గెలుపుకాదు
నడుమ మునిగినా-ఓటమి కాదు ॥నీ నామ॥

---

## పల్లెటూరి చిన్నోడు

## 110

సాకి :

మంచికి మారుపేరైన-మనిషికథే రామకథ !
మమతల విలువలు తెలిపే-మధురకథే రామకథ !

**పల్లవి :**

పాడితే రామయ్యపాటలే పాడాలి
వేడితే ఆ అయ్యనే వేడుకోవాలి

చరణం :

అన్నలందరు రామన్నలైతే
వదినెలందరు సీతమ్మలైతే
తమ్ముళ్లందరు లక్ష్మన్నలైతే
జగమే తరియించి పోవునులే-కలి
యుగమే త్రేతాయుగమౌనులే ॥పాడితే॥

చరణం :

పాలకులే రామచంద్రులై
సేవకులే ఆంజనేయులై
ప్రజలసేవకే అంకితమైతే
అవతరించును రామరాజ్యం
అపుడే జాతికి సౌభాగ్యం ॥పాడితే॥

చరణం :

కోతులతోనే-కోదండ రాముడు
కొండంత లంకనుగెలిచాడు
ఉడతాభక్తినీ-పూతగ చేకొని
కడలికి వారధికట్టాడు
సాధనవుంటే-సాధించలేనిది
లేనే లేదని చాటాడు. ॥పాడితే॥

---

**పల్లెటూరి చిన్నోడు**

## 111

పల్లవి :

మమ్ము బ్రోవమని చెప్పవే ! సీతమ్మ తల్లి !
మమ్ము బ్రోవమని చెప్పవే !
ఏకాంతరామయ్య నీచెంతగా చేరి
చల్లంగ నీ ముద్దు - చెల్లించువేళ

చరణం :

మీరూ ఈ గోదారి-తీరాన నడిచారు
కన్నీళ్ల నవ్వాలూ - కలబోసుకున్నారు
ఆ కథను కాస్త గురుతు చేసుకొమ్మనీ
మా కష్టాలు కాస్త చూసి పొమ్మనీ
నువ్వయినా చెప్పవమ్మా
రామయ్యకూ - ఆ అయ్యకూ ॥మము॥

చరణం :

మారాజులు మంత్రులు - మి
మ్మడగ వచ్చేవారలే
మా బోటి దీనులు-మీ
కడకు వచ్చేవారలే
ఇంతో అంతో ముడుపు కట్టి
అంతటయ్యను మాయచేసి
లక్షలో మోక్షమ్ము కోరే
గడుసు బిచ్చగాళ్ళము
వట్టి పిచ్చివాళ్లము
ఆదుకొమ్మని-పైకి
చేదుకొమ్మని చెప్పవమ్మా
రామయ్యకు-మా అయ్యకు ॥మము॥

చరణం:

పులినిచూస్తే-పులీ ఎన్నడు బెదరదూ
మేక వస్తే-మేక యెన్నడు అరవదూ
మాయరోగమదేమొకాని
మనిషిమనిషికి కుదరదు
ఎందుకో తెలుసా తల్లీ !
ఉన్నది పోతుందన్న బెదురుతో - అను
కున్నది రాదేమోనన్న అదురుతో
కొట్టుకుంటూ తిట్టుకుంటూ
కొండకెక్కే-వాళ్ళము - మీ
అండ కోరేవాళ్ళము
కరుణించమని చెప్పవే ! మాకన్నతల్లి !
కరుణించమని చెప్పవే ! ॥మము॥

# 112

పల్లవి :

శ్రీగౌరి శ్రీగౌరియే - శివుని
శిరమందు ఏ గంగ - చిందులువేసినా

చరణం :

సతిగా తన మేను చాలించి - పా
ర్వతిగా మరుజన్మ ధరియించి
పరమేశునకై తపియించి ఆ
హరుమేన సగమై పరవశించిన ॥శ్రీగౌరి॥

చరణం :

నగకన్యగా తాను జనియించినా
జగదంబయైనది హైమవతి.
సురలోకమున తాను ప్రభవించినా
తరళాత్మయైనది మందాకిని.

చరణం :

ఒదిగి ఒదిగి పతి
పదములందు నివసించియుండు గౌరి
ఎదిగి ఎదిగి పతి
సిగనుదూకి నటియించుచుండు గంగ.
లలితరాగకలితాంతరంగ గౌరి !
చలితజీవనతరంగరంగగంగ.
ధవళాంశుకీర్తి గౌరి
నవఫేనమూర్తి గంగ.
కల్పాంతమైన
భువనాంతమైన
క్షతియెరుగని
మృతిఎరుగని నిజమిది ॥శ్రీగౌరి॥

# 113

సాకి :

పలచిన మనసే ఆలయం–అది
ఒకే దేవునికి నిలయం
ఆ దేవుని అలరించు దారులు రెండు
ఒకటి అనురాగం–ఒకటి ఆరాధనం.

పల్లవి :

నీవన్నది-నీవనుకున్నది
నేనన్నది-ఇలలో ఉన్నది
నీ మదిలో మెదిలే స్వప్నమది
స్వప్నంకాదు సత్యమిది !
మాయని జీవితసత్యమిది !

చరణం :

ఒక హృదయంలో నివసించేది
ఒకే ప్రేమికుడు కాదా !
ఆ ప్రేమికుని మనసార చూసే
కన్నులు రెండు కాదా !

చరణం :

శ్రీనివాసుని ఎదపై నిలిచేది
శ్రీలక్ష్మియే కాదా !
అలివేలుమంగ దూరానవున్నా
అతని సతియే కాదా !

చరణం :

బ్రతుకుదారిలో నడిచేవారికి
గమ్యం ఒకటే కాదా !

పదిలంగా ఆ గమ్యం చేర్చే
పాదాలు రెండు కాదా!

చరణం :

కృష్ణుని సేవలో పరవశమొందిన
రుక్మిణి నా ఆదర్శం
అతని ధ్యానమున అన్నీ మరచిన
రాధయె నా ఆదర్శం
రాధయె నా ఆదర్శం.

# 114

సాకి :

రఘుకులతిలకా! నీ ఆనతి
రచియించితి రామాయణ సత్కృతి-ఆ
కృతి వరియించిన పతివి నీవే
అతులితకైవల్యగతివి నీవే!

పల్లవి :

జగమే రామమయం-మనసే
అగణిత తారకనామమయం.

చరణం :

నీలజలదరమణీయరూపం
నిగమాంచలమందిరమణిదీపం
సుందరజానకీవందితచరణం
సురమునిశరణం! భవతాపహరణం! ॥జగమే॥

చరణం :

ఆ చిరునవ్వే-అమృతపుజల్లు
అఖిలజగములేలు-ఆ చేతి విల్లు
అతని గానమున-అలరారు కావ్యం
అన్ని యుగాలకు-నవ్యాతినవ్యం ॥జగమే॥

చరణం :

ఎవని కమలకమనీయపదము-చూ
పించె అహల్యకు ముక్తిపదము

114

ఎవని చంద్రికామృదులకరము-అం
దించెను శబరికి దివ్యవరము
ఎవని ఏలుబడి-ఇంటికొక్క గుడి నిలిపెనో
ఎవని రాజ్యమే-రామరాజ్యమై వెలసెనో
ఆ రాముడు నా అంతరంగమున నిండగా.
అహము మరచి ఈ-యిహము మరచి
జన్మాంతరబంధములెల్ల విడిచి
ఆ మహర్జ్యోతిలో లీనముకానా
ఆ మహాప్రభునిలో లీనముకానా
ఓ రామా ! రఘురామా ! కైవల్యరామా !

## 115

పల్లవి :

మల్లియలారా ! మాలికలారా !
మౌనముగా ఉన్నారా !
మా కథయే విన్నారా !

చరణం :

జాబిలిలోనే-జ్వాలలురేగె
వెన్నెలలోనే-చీకటిమూగె
పలుకగలేక-పదములురాక
బ్రతుకే తానే-బరువై సాగె ॥మల్లియ॥

చరణం :

చెదరినవీణ-రవళించేనా
జీవనరాగం-చివురించేనా
కలతలుపోయి-వలపులుపొంగి
మనసే లోలో-పులకించేనా. ॥మల్లియ॥

# 116

పల్లవి :

చందమామవీణియపైన
తెలివెన్నెలతీగలపైన
కరిగే కలలే స్వరాలుగా
పాడనా— నే
పాటనా.

చరణం :

మనసులోన మెరిసేరూపం
మౌనంలో కరిగింది
పెదవిపైన విరిసే రాగం
హృదయంలో వెలిగింది.
మౌనంలోన-గానంలోన
మధురిమయేదో ఉన్నదని ॥పాడనా॥

చరణం :

ఏ రెమ్మకు పూచిన సుమమో
నీపూజకు నిలిచింది
ఏజన్మల నోముల ఫలమో
ఇరువురినీ కలిపింది.
ఆరాధనలో — ఆవేదనలో
ఆశలపున్నమి ఉన్నదని ॥పాడనా॥

మహాత్ముడు

## 117

పల్లవి :

ఆలుమగలు విడిపోయినంతనే
అనురాగాతే మారునా !
విడిగా బ్రతుకులు గడిపినంతనే
వివాహబంధం తీరునా !

చరణం :

నుదుట బాసికము తీసినంతనే
పదముల పారాణి మాసినంతనే
అగ్నిసాక్షిగా అంకితమైన
అంతరంగములు వేరౌనా. ॥ఆలు॥

చరణం :

మంగళసూత్రము కట్టిననాడే
మనసులు ముడిపడిపోలేదా
ఏడడుగులు నడచిననాడే
ఇరువురు ఒకరై పోలేదా. ॥ఆలు॥

చరణం :

కోవెల తలుపులు మూసినంతనే
దైవము దూరమైపోవునా
మనసున చీకటి కమ్మినంతనే
మమతలవెలుగులు మాయునా. ॥ఆలు॥

పల్లవి :

మురళీలోలుడు-మరులను పొంగించి
మోముచూపడాయె
చేసిన బాసలు-రేపిన ఆశలు
నీటిరాతలాయె-క
న్నీటిరాతలాయె.

చరణం :

ఆ యమునానది-ఆ బృందావని
అడిగెను నన్నే నీ ప్రియుడేడని ?
మదిలో చెలరేగే సుడిగాలులలో
బదులు పలికేను ఏమని ? ఏడని ? ॥మురళీ॥

చరణం :

ఎన్నినాళ్ళని రగిలే గుండెను
కన్నీళ్ళమాటున దాచేను
ఎవరికోసమని ఎందుకోసమని
కడుపున కార్చిచ్చు మోసేను ॥మురళీ॥

చరణం :

రేపటివెలుగుల రాకకు వేచీ
నేటి చీకటి గడపాలీ
వెలుగేలేని విధియే నాదని
తెలిసీ దేనికి బ్రతకాలి. ॥మురళీ॥

## 119

పల్లవి :

పెదవులపైన సంగీతం
హృదయములోన పరితాపం
సెగలై రగిలే నా బ్రతుకే
చివరికి పాడెను ఈ గీతం.

చరణం :

మధువుచూచి ఆగినాను
మనసుతీర తాగినాను
కమ్మని ఆ మధువేకాదు
కన్నీళ్ళు తాగినాను
ఇన్నాళ్ళు సాగినాను ॥పెద॥

చరణం :

జీవించే తలపే లేదు
చావంటే వెరపేలేదు
చీకటినే కోరిన నాకు
వేకువ యిక లేనేలేదు
వెలుగులతో పనిలేదు. ॥పెద॥

## 120

పల్లవి :

మూగరాగాలలో ఎన్ని భావాలో !
ఆ భావాలలో ఎన్ని గాయాలో !

చరణం :

చెలిమి విలువ తెలియదు
విడిపోయేవరకు
కలల విలువ తెలియదు
కరిగేవరకు
అడుసులోతు తెలియదు
అడుగువేసేవరకు
వేసిన అడుగు తీయలేవు
వేకువ అయ్యేవరకు ॥మూగ॥

చరణం :

రేయి ముసుగులో
దాగిన పొద్దుపొడుపు-ఆ
పొద్దునుదుట
దిద్దిన కుంకుమ ఎరుపు-ఆ
కుంకుమకై కలవరించు
కోమలి హృదయం-ఆ
హృదయంలో వేదనలకు లేదా అంతం. ॥మూగ॥

చరణం :

తెల్లవారితే లోకం
కళ్ళు విప్పుతుంది
పొద్దువాలితే లోకం
నిద్దురపోతుంది
తెల్లవారినా
పొద్దువాలినా-నా
కళ్ళల్లో పెనుచీకటి
కదలిపోనంటుంది. ॥మూగ॥

## 121

పల్లవి :

కనులుమూసి హాయిగా
కలతలేని నిదురపో
కలలురాని నిదురపో.

చరణం :

పేదవారి బ్రతుకుదారి
తెలవారని చీకటి
వారికున్నదేమిటి ?
ఆరిపోని ఆకలి !
తెరచుకున్న కనులలోన
కురిసేవి కన్నీళ్ళే
ఈ మూసిన కనులలోన
ఏ బాధలు ఉండవులే. ॥కనులు॥

చరణం :

కలిమిలేమి లేనిచోట
వెలుగునీడ లేనిచోట
చావుబ్రతుకు లేనిచోట
పరమశాంతి దొరుకుచోట
నేలతల్లి ఒడిలో
నిన్ను మరచి-అన్ని మరచి
నిదురపో ! నిదురపో ! ॥కనులు॥

## 122

పల్లవి :

ఎవరున్నారు పాపా ! మీ
కెవరున్నారు ?
చీకటి కమ్మిన కళ్ళున్నాయి-ఆ కళ్ళలో
కావలసినన్ని కన్నీళ్ళున్నాయి,

చరణం :

కన్నతల్లి వెళిపోయింది-బంధాలన్నీ తెంచుకొని
తనుతానే-వంచించుకొని
ఉన్న తండ్రి పడి ఉన్నాడు-మనసున చేదు నింపుకొని
తనుతానే-చంపుకొని
ఈ ఇంటిలోన-నేనొక ఇల్లాలినైనా
మీ తల్లిని కాలేనమ్మా-కన్నతల్లిని కాలేనమ్మా. ॥ఎవ॥

చరణం :

ఉదయించే కిరణాలై-ఎదుగుతున్న పాపలు మీరు
ముసిరే పొగమంచులోన-మసకేసి పోతున్నారు.
ఏ యింటనైనా-ఈ కలతలువున్నా
ముందు బలిఅయ్యేది పిల్లలే
ఏపాపమెరుగని పాపలే. ॥ఎవ॥

## 123

పల్లవి :

పగిలిన అద్దంలో
అగుపించినదేమిటి ?
ముక్కలైన నీ వదనం ! వేయి
చెక్కలైన నీ హృదయం !

చరణం :

మనిషికి మనసెందుకుండాలి–ఆ
మనసున వలపెందుకు నిండాలి
పాలవంటి వలపెందుకు తొణకాలి
పరమాత్ముని నిలదీసి అడగాలి ॥పగిలిన॥

చరణం :

అరికాలికి నాటుకున్న ముల్లు
అవలీలగ తీసివేయగలవు
ఎదలోపల నాటుకున్న ముల్లు
ఏనాడూ తీసివేయలేవు. పగిలిన॥

పల్లవి :

విధి ఒక విషవలయం! విషాద
కథలకు అది నిలయం!

చరణం :

పువ్వుమాటునా-పొంచిన ముల్లు
నాటేదాకా తెలియదు
కదలిక డుపునా-బడబానలము
రగిలేదాకా తెలియదు
పచ్చని తరువు-సుడిగాలిపాలై
విరిగేదాకా తెలియదు

చరణం :

కలలోనైనా ఎడబాటెరుగని
కులసతి ఎంతగా వగచెనో
ఇన్నాళ్ళాయెను నాన్న ఏడని
కూతురెంతగా వేచెనో
గుండె చెరువుగా కుమిలిన మాంతమ్మ
పండుటాకులా మిగిలెనో. ॥విధి ఒక॥

చరణం :

చెట్టుకొకటిగా చెదరిన గువ్వలు
చివరికి గూటికి చేరేనా
మమతలు నిండిన మా కాపురమే
మళ్ళీ కళకళలాడేనా...

## 125

సాకి :

ఆడనా-పాడనా

పల్లవి :

పాడనా-మనసు పాడని పాట
ఆడనా-పదములాడని ఆట.

చరణం :

కరవాలం విసిరితే
కలకోకిల కూయునా
కొరడా ఝళిపించితే
కుసుమం విరబూయునా
మదమత్తత కాదోయీ
మధుహృదయం కావాలి
అధికారం కాదోయీ
అనురాగం కావాలి. ॥పాడనా॥

చరణం :

నను పలికించేవాడు
మనసిచ్చిన నా ప్రియుడు
నా పిలుపులు వింటాడు
నన్ను చేరుకుంటాడు
నిను రెండుగ చీలుస్తాడు
నీ గుండెలు ఖండిస్తాడు
నీ రక్తం నా పాదాలకు
పారాణిగ పూస్తాడు.

పల్లవి :

ఎందాకా ? ఈ పయనం ఎందాకా ?
ఎక్కడ విధి కాటువేయదో
ఎక్కడ కన్నీరు పుండదో
అందాకా-నా పయనం-అందాకా.

చరణం :

నవ్వుతూ బ్రతికేవారు కొందరు
ఏడుస్తూ చితికేవారు కొందరు
నా సంగతి వేరురా-నే జీవించేనురా
నవ్వుతూ ఏడవలేక-ఏడుస్తూ నవ్వలేక. ॥ఎందాకా॥

చరణం :

చెల్లినే తల్లిలాగా చూశాను
ఇల్లాలిని గుండెల్లోన దాచాను
ఆ యిరువురు దూరమై-నాదైవం క్రూరమై
మల్లెతోటలో చితిమంటలు చూశాను. ॥ఎందాకా॥

చరణం :

ఈ లోకం కొండంత గూడురా-అందులో
ఎన్ని గువ్వలైవా ఒదిగిపోవురా
నష్టజాతకుని నీడ-నాన్నా ! నీకెందుకురా ?
పచ్చని ఏ పంచనైనా-బ్రతకరా నువ్వైనా. ॥ఎందాకా॥

కర్పూరహారతి

## 127

పల్లవి :

నాకు కనులులేవు-నీవు పలుకలేవు
బ్రతుకులోని తీయదనం-పంచుకోలేము.

చరణం :

రవ్వలజాబిలిలో
రంగారు వెన్నెలనూ
పువ్వులగిన్నెలలో
పొంగారు తేనెలనూ
కనజాలక లోలోన
కలవరింతు నేను
కనగలిగీ అనజాలక
కలతపడుదు నీవు. ॥నాకు॥

చరణం :

సన్నిధి నీవుంటే
కన్నులు నాకేలా
దాపున నీవుంటే
దైవం వేరేలా
నీమది పలికే భాషను
నేర్చుకొందు నేను
నీ పదముల మల్లికనై
నిలిచిపోదు నేను. ॥నాకు॥

పెంపుడు కూతురు

పల్లవి :

కనులుండి చూడలేను
గళముండి పాడలేను
మనసుంది మంటలందే
చినుకైన నోచుకోను. ॥కనులుండి॥

చరణం :

కాలము పామై కరచెనే-నా
దైవము నన్నే మరచెనే
చిగురించే జీవితమే
పొగచూరిపోయెనే. ॥కనులుండి॥

చరణం :

కన్నీటిజల్లు వెలిసెనా
హరివిల్లులోన విరిసెనా
కనరేమీ ? నాస్వామీ !
మునుముందు నిలిచినా. ॥కనులుండి॥

చరణం :

రసజీవనమ్ము నీది
విషజాతకమ్ము నాది
ఇకనైన గతము మరచి
సుఖియించుమో ప్రియా! ॥కనులుండి॥

---

పరువు-ప్రతిష్ఠ

## 129

పల్లవి :

నీకోసం-నీకోసం
నా గానం-నా ప్రాణం.

చరణం :

నీ కన్నుల వెలుగులో
నీలినీడలెందులకో
నీ వెన్నెలమనసులో
ఈ విషాదమెందుకో !
నీ బాధలు పంచుకొనగ
నేనుంటిని కాదా ! ॥నీకోసం॥

చరణం :

నీ వేదనలోనే
నా వేదన లేదా !
నీ సన్నిధిలోనే
నా పెన్నిధి లేదా !
నీ చిరునవ్వులకోసం
నేనుంటిని కాదా ! ॥నీకోసం

చరణం :

నేల నిదురపోయె
నింగి నిదురపోయె
గాలి నిదురపోయె-లో
కాలె నిదురపోయె
నా హృదయమె నీ పానుపుగా
నిదురించగరావా ! ॥నీకోసం॥

## 130

పల్లవి :

బాపూ! చూశావా నీ దేశం-నువు కలలుగన్న మా దేశం!
ఏమైపోయెను ? ఏమైపోయెను ? నీవిచ్చిన సందేశం!

చరణం :

నీవు కట్టిన కోవెలలో-నిలిచె నేడు రాబందులు
నీవు తెచ్చిన వెలుగులలో-నిండెను చీకటి నీడలు
తెల్లతెల్లని ముసుగులలో-నల్లబజారులు నడిపేరు
కల్లలెరుగని పేదల-నోళ్ళకు సంకెళ్ళు వేసేరు
నిన్నే జాతిపితవని అంటూనే-నీ ఖ్యాతికి గోతులు తీసేరు
నీ సమాధిపై పూలుచల్లి-నీ నీతిని పాతరవేసేరు. ॥బాపూ॥

చరణం :

ఒక్క తల్లికే పుట్టారు-ఒక్క ఇంటనే పెరిగారు
చిల్లర తగవులు పెంచుకొని-తల్లి కడుపునే తరిగేరు
ఊళ్ల తగాదాలొకవైపు-నీళ్ల తగాదాలొకవైపు
ప్రాంతభేదములు ఒకవైపు-భాషాద్వేషాలొకవైపు
అయ్యో! రామరాజ్యమిదియేనా!
కూలీ, రైతురాజ్యమిదియేనా!
స్వాతంత్ర్యయోధులు సాధించిన-ఆ
స్వరాజ్యఫలితం యిదియేనా! ॥బాపూ॥

## 131

పల్లవి :

అబలను ఎందుకు పుట్టించావనీ
ఆ దేవుణ్ణి ఎవ్వరడిగేది !
అతడే ఒక అబలగా జన్మించివుంటే
ఆడదాని వేదన తెలిసేది !

చరణం :

కలువలవంటి కన్నులెందుకు ఇచ్చాడు ?
కడివెడు కన్నీళ్ళు కురియడానికి
చిగురాకువంటి తన్నువెందుకు ఇచ్చాడు ?
రగిలి రగిలి బూదిగా మిగలడానికి
నునుసిగ్గుల దొంతరలు ఎందుకు ఇచ్చాడు?
మనసులోని మాట అణచివేయడానికి. ॥అబల॥

చరణం :

తీవెతల్లి ఒడిలోన విరిసిన మల్లియకు
మొగమెరుగని తుమ్మెదపై-మోహమెందుకో !
తలిదండ్రుల నీడలో-పెరిగిన కన్నియకు
మనసెరుగని పురుషునిపై-మమతలెందుకో !
వలచిన ఆ హృదయం-వేయితునక లౌతున్నా
చితికిన కలలింకా-అతుకు లెందుకో. ॥అబల॥

## 132

పల్లవి :

చూస్తున్నావా ఓ దేవా !
చూస్తూ ఊరకే ఉన్నావా !
జరిగే ఘోరాలు- పెరిగే పాపాలు
కనలేక మోము దాచుకున్నావా ! ఏ
మనలేక మూగవై వున్నావా !

చరణం :

చితికిపోయిన గాజుబొమ్మను
అతికించగలము ఏలాగైనా
చెదిరిపోయిన మగువ శీలం
కుదురుకోదు ఈ జన్మలోన
దారం తెగిన గాలిపడగ
గాలిపాలో నేలపాలో
కాటుతిన్న కన్నె బ్రతుకు
కాటిపాలో ఏటిపాలో ॥చూస్తున్నావా॥

చరణం :

మొగిలి పువ్వులా బ్రతకాలంటే
చుట్టూ పాములు తప్పవా !
మంచి మనిషిగా నిలవాలంటే
వంచనలెన్నో తప్పవా !
ఆత్మబలంతో నడవాలంటే
అగ్నిపరీక్షలు తప్పవా !
దేవుని సృష్టిలో మనిషికి తీరని
ఆవేదనలే తప్పవా ! ॥చూస్తున్నావా॥

---

## డబ్బుకు లోకం దాసోహం

## 133

పల్లవి :

ఎవరిని అడగాలి? బాపూ!
ఏమని అడగాలి ?
మూగగుండెలో రగిలే బాధ
మూగగానే మిగలాలి.

చరణం :

సిరిమల్లెల విరియించే వసంతం
చిగురాకులనే రాల్చేస్తే
నావను నడిపే చుక్కాని-ఆ
నావను తానే ముంచేస్తే. ॥ఎవరిని॥

చరణం :

వలపులుపోసి పెంచిన తీవే
కాలసర్పమై కాటేస్తే
మమతలు పంచిన పాలమనసే
మనసును కాస్తా విరిచేస్తే. ॥ఎవరిని॥

చరణం :

రాయిని తీసి రవ్వగచేసి
నా యెదపైనే నిలిపానే-ఆ
రవ్వయె తానొక నిప్పురవ్వయై
నా యెదనే కాల్చేస్తే. ॥ఎవరిని॥

## 134

పల్లవి :

తొలివలపే తీయనిది
మదిలో మిగిలిన గాయమది
కలలాగా పెరిగినది
కథలాగా ముగిసినది.

చరణం :

అవే కెరటాలు-అవే కిరణాలు
అదే గాలి ఈల-అదే సందెవేళ
అన్నీ ఉన్నాయి-అలాగే ఉన్నాయి-కాని
చెలి ఒకతే కరువైనది-జీవితమే శిలయైనది. ॥తొలి॥

చరణం :

రాధా !
ఆనాటి ఆ బాసలేమాయెనో
ఆ కలలు ఆ చెలిమి ఏమాయెనో
కొడిగట్టిన ఈ దీపం ఆరకముందే
కొనవూపిరి ఈ గూటిని వీడకముందే
ఓ చెలీ ! ఓ చెలీ !
కడసారైనా నినుచూడనీ—నీ
ఒడిలోనే కనుమూయనీ. ॥తొలి॥

---

**నీడలేని ఆడది**

## 135

పల్లవి :

బొమ్మలూ-ఈ మనుషులూ
అంతా బొమ్మలూ
ఆ దేవుడు చేసిన బొమ్మలు !

చరణం :

పసితనంలో తల్లితీపి
పడుచుతనంలో ప్రేమ తీపి
పెరిగేకొద్దీ పెళ్ళి తీపి
చచ్చేదాక చావని తీపి
ఎవరికీ ? ఎవరికీ ?
ఈ బొమ్మలకి
ఏం బొమ్మల్లు ?
పిండిబొమ్మలు ! పిచ్చి బొమ్మలు ! ॥బొమ్మలూ॥

చరణం :

మూడుముళ్ళు వేయిస్తావు
వేసిన ముళ్లు విడదీస్తావు
ముద్దూ మోజూ పెంచేస్తావు
మొగ్గలోనే తుంచేస్తావు
అయినా నీ చుట్టే తిరుగుతుంటాయి
ఏమిటి ?
మట్టిబొమ్మలు !
ఈ మనిషి బొమ్మలు ! ॥బొమ్మలూ॥

చరణం :

దీపమున్నా వెలుగేలేదు
వెలుగు ఉన్నా విలువేలేదు
మనువు ఉన్నా మనసు లేదు
మనసే ఉన్నా మమతే లేదు
పాపం !
మూగబొమ్మలు
ముష్టిబొమ్మలు
సృష్టిపొలంలో
దిష్టిబొమ్మలు. ॥బొమ్మలూ॥

## 136

పల్లవి :

వలచే ప్రతి మనిషికీ
మరచే మనసుండాలి-అది
మరువలేని మనసైతే
మట్టిముద్దగా మార్చాలి.

చరణం :

ఎండమావిలో నీళ్లుంటాయని
ఎవరో అంటే నవ్వాను
అవునోకాదో చూడాలని
అంచులదాకా వెళ్లాను
వెళ్ళాను-చూశాను
ఉన్నాయి-నీళ్ళున్నాయి
ఏం నీళ్ళు ? కన్నీళ్ళు.
ఆ కన్నీళ్ళతో పాపాలన్నీ
కడిగేయాలనుకున్నాను
చేతులు రెండూ సాచాను
దోసెడు శూన్యం చూశాను. ॥వలచే॥

చరణం :

మరణం నా గుండెలోన పెరుగుతున్నది-అది
మధువు తాగి మరీమరీ బతుకుతున్నది
బతికీ బతికీ అది నన్నేం చేస్తుంది ?
చచ్చినా వీడు చావడని
తానే చస్తుంది మరణం
తానే చస్తుంది. ॥వలచే॥

---

ముద్దబంతిపువ్వు

పల్లవి :

పాటకాదు పాపా! ఇది పాటకాదు
దగాపడిన ప్రతి వనిత గుండెలోని కోత!

చరణం :

కళ్ళనిండ నీళ్ళు-రొమ్మునిండ పాలు
కలబోసిన రూపమే ఆడది-ఆ
కన్నీటి చేదంతా నాలోనే వుండనీ
కమ్మని పాలతో నీ కడుపు నిండనీ. ॥పాట॥

చరణం :

ఆడదాని కడుపున పుట్టిన మగవాడు
ఆడదాన్ని బానిసగా మార్చాడు-ఈ
మగవాళ్ళ పన్నాగా లెన్నాళ్ళు-ఇక
ఛేదించుము నీవైనా యుగయుగాలసంకెళ్ళు. ॥పాట॥

## 138

పల్లవి :

మన్నించుమా ప్రియా !
మన్నించుమా !
మరుమల్లె నల్లగా ఉంటే
చిరునవ్వు చేదుగా ఉంటే
ఆ తప్పు నాది కాదంటే
మన్నించుమా ప్రియా! ॥మన్నించుమా॥

చరణం :

నా కంటికులుకులలోన
నీ కలలు చెదురుతువుంటే
నా కాలి చిందులలోన
నీ గుండె నలుగుతువుంటే
సగము రేయి—రగిలిపోయి
సెగలుగా మారిపోతుంటే ॥మన్నించుమా॥

చరణం :

అలనాటి బాసలన్నీ
సెలయేటి రాతలైతే
కుసుమించు ఆశలన్నీ
వసివాడి రాలిపోతే
పెదవి వణికి—మధువు తొణికి
హృదయమే తూలిపోతుంటే
ఆ తప్పు నాది కాదంటే
మన్నించుమా ప్రియా! ॥మన్నించుమా॥

---

## నా పేరే భగవాన్

# 139

పల్లవి :

అతడు : ఒక దీపం వెలిగింది
ఒక రూపం వెలసింది
స్నేహంలో రేకులు విరిసీ
చిరునవ్వుల వెలుగులు కురిసీ

ఆమె : ఒక దీపం మలిగింది
ఒక రూపం తొలగింది.
వేకువ ఇక లేదని తెలిసీ
చీకటితో చేతులు కలిపీ

చరణం :

అతడు మంచు తెరలే కరిగిపోగా
మనసు పొరలే విరిసిరాగా
చెలిమిపిలుపే చేరుకోగా
అనురాగపుమాలికలల్లీ
అణువణువున మధువును చల్లీ
ఒక ఉదయం పిలిచింది
ఒక హృదయం ఎగిసింది

చరణం :

ఆమె : నింగి అంచులు అందలేక
నేలపైన నిలువరాక
కన్నెకలలే వెతలుకాగా
ఉన్న రెక్కలు చితికిపోగా
కనిపించని కన్నీట తడిసీ
బడబానల మెదలో ముడిచీ
ఒక ఉదయం ఆగింది
ఒక హృదయం ఆరింది

ఏకవీర

# 140

పల్లవి :

తెలుగుజాతిమనది—నిండుగ
వెలుగు జాతిమనది
తెలంగాణా నాది—రాయలసీమ నాది
సర్కారునాది—నెల్లూరునాది
అన్నీ కలసిన తెలుగునాడు-మనదే-మనదే-మనదేరా

చరణం :

ప్రాంతాలు వేరైనా—మన
అంతరంగ మొకటేనన్నా
యాసలువేరుగ వున్నా—మన
బాస తెలుగుబాసన్నా
వచ్చిండన్న వచ్చాడన్నా
వరాల తెలుగు వొకటేనన్నా ॥తెలుగు॥

చరణం :

మహాభారతం పుట్టింది
రాజ్మహేంద్రవరంలో
భాగవతం వెలసింది
ఏకశిలానగరంలో
ఈ రెంటిలోన ఏదికాదన్నా
ఇన్నాళ్ళ సంస్కృతి నిండుసున్న ॥తెలుగు॥

చరణం :

పోచంపాడు ఎవరిది ?
నాగార్జునసాగరమెవరిది ?
మూడు కొండ్రలూకలిసిదున్నిన

ముక్కారు పంటలు బండ్లకెత్తిన
అన్నపూర్ణమ్మ కన్నబిడ్డలౌ
అయిదుకోట్ల తెలుగువారిది ॥తెలుగు॥

చరణం :

సిపాయికలహం విజృంభించ
నరసింహాలై గర్జించాము
గాంధి నేతృత్వాల పిలుపు అందుకొని
సత్యాగ్రహాలు చేశాము
స్వరాజ్యసిద్ధి జరిగినపిమ్మట
స్వరాష్ట్రమును సాధించాము
దేశభక్తిలో తెలుగువారికి
దీటే లేదనిపించాము ॥తెలుగు॥

చరణం :

ఇంటిలో అరమరికలు ఉంటే
ఇల్లెక్కి చాటాలా!
కంటిలో నలక తీయాలంటే
కనుగ్రుడ్డు పెరికివేయాలా!
పాలుపొంగు మన తెలుగుగడ్డను
పగలగొట్టవద్దు !
నలుగురిలో మనజాతిపేరును
నవ్వులపాలు చెయ్యొద్దు

తల్లా పెళ్లామా ?

## 141

పల్లవి :

దీపానికి కిరణం ఆభరణం
రూపానికి హృదయం ఆభరణం
హృదయానికీ—ఏనాటికీ
తరగనిసుగుణం ఆభరణం

చరణం :

నిండుగ పారే యేరూ - తన
నీటిని తానే తాగదు.
జగతిని చూపే కన్ను - తన
ఉనికిని తానే చూడదు.
పరుల కోసం బ్రతికే మనిషి - తన
బాగు తానే కోరడు...... ॥దీపానికి॥

చరణం :

తాజమహలులో కురిసే వెన్నెల
పూరిగుడిసెపై కురియదా.
బృందావనిలో విరిసే మల్లియ
పేదముంగిట విరియదా.
మంచితనమూ — పంచేవారికీ
అంతరాలతో పనివుందా...... ॥దీపానికి॥

చరణం :

వెలుగున ఉన్నంతవరకే - నీ
నీడ తోడుగా ఉంటుంది.
చీకటిలో నీవు సాగితే - అది
నీకు దూరమవుతుంది - ఈ
పరమార్థం తెలిసిననాడే
బ్రతుకు సార్థకమవుతుంది...... ॥దీపానికి॥

## 142

పల్లవి :

పుట్టినరోజు పండగే అందరికి - మరి
పుట్టింది ఎందుకో తెలిసేది ఎందరికి !

చరణం :

కలిమికేమి వలసినంత ఉన్నా - మనసు
చెలిమికొరకు చేయి సాచుతుంది-
ఆ మనసే ఎంత పేదదైనా
అనురాగపుసిరులు పంచుతుంది
మమత కొరకు తపియించే జీవనం - దైవ
మందిరంలా పరమపావనం ॥పుట్టిన॥

చరణం :

పువ్వెందుకు తీగపైన పుడుతుంది ?
జడలోనో గుడిలోనో నిలవాలని
ముత్యమేల కడలిలో పుడుతుంది ?
ముచ్చటైన హారంలో మెరవాలని.
ప్రతి మనిషీ తన జన్మకు - పరమార్థం తెలుసుకొని
తన కోసమేకాదు - పరులకొరకు బతకాలి
తా నున్నా లేకున్నా - తన పేరు మిగలాలి ॥పుట్టిన॥

## 143

పల్లవి :

మానవజాతి మనుగడకే
ప్రాణం పోసింది మగువ.
త్యాగంలో అనురాగంలో
తరగని పెన్నిధి మగువ.

చరణం :

ఒక అన్నకు ముద్దుల చెల్లి
ఒక ప్రియునికి వలపులమల్లి
ఒక రామయ్యకే కన్నతల్లి
సకలావనికే కల్పవల్లి ॥మానవ॥

చరణం :

సీతగా - ధరణిజాతగా - సహన
శీలం చాటినది.
రాధగా - మధురబాధగా - ప్రణయ
గాథల మీటినది.
మెల్లగా - కవితలల్లగా - తేనె
జల్లు కురిసింది
లక్ష్మిగా - ఝాన్సిలక్ష్మిగా - సమర
రంగాన దూకినది. ॥మానవ॥

చరణం :

తరుణి పెదవిపై చిరునగవొలికిన
మెరయును ముత్యాలసరులు.
కలకంఠి కంట కన్నీరొలికిన
తొలగిపోవురా సిరులు.
కన్నకడుపున చిచ్చురగిలెనా
కరువుపాలౌను దేశం.
తల్లిని మించిన దైవంలేదని
తరతరాల సందేశం.

॥మానవ॥

## 144

పల్లవి :

కదలించే వేదనలోనే
ఉదయించును నాదాలు
ఉదయించిన నాదంలోనే
కదలాడును వేదాలు

చరణం :

కలతపడిన మేఘం – తానే
చిలకరించు పన్నీరు
పెల్లగిలిన నేలలోనే
పల్లవించు బంగరుపైరు ॥కదలించే॥

చరణం :

కన్నెయెంకి కన్నులలోన
కానరాని వెన్నెలలన్నీ
అందుకున్న నాయుడు బావ
చెందురుడై నిలిచెను గాదా! ॥కదలించే॥

చరణం :

నాటి రాధ తీయని బాధ
నేటికైన మాయని గాథ
మరపురాని ఆ కథ వింటే
మనసే బృందావని కాదా. ॥కదలించే॥

## 145

పల్లవి :

తూర్పూ పడమర ఎదురెదురు
నింగీ నేలా ఎదురెదురు
కలియని దిక్కులు కలవవనీ
తెలిసి ఆరాటం దేనికని ?
ఈ ప్రశ్నకు బదులేది ?
ఈ సృష్టికి మొదలేది ?

చరణం

తూర్పున ఉదయించే సూర్యుడు
పడమట నిదురించును
పడమట నిదురించే సూర్యుడే
తూర్పున ఉదయించును.
ఆ తూర్పు పడమరకేమౌను ?
ఈ పడమర తూర్పునకేమౌను ?
ఈ ప్రశ్నకు బదులేది ?
ఈ సృష్టికి మొదలేది ? ॥తూర్పూ॥

చరణం :

నింగిని సాగే నీలి మేఘం
నేలఒడిలో వర్షించును
నేలను కురిసే ఆ నీరే
నింగిలో మేఘమై పయనించును
ఆ నింగికి నేల ఏమౌను ?
ఈ నేలకు నింగి ఏమౌను ?
ఈ ప్రశ్నకు బదులేది ?
ఈ సృష్టికి మొదలేది ?

పల్లవి :

స్వరములు ఏడైనా రాగాలెన్నో
హృదయం ఒకటైనా భావాలెన్నో
అడుగులు రెండైన నాట్యాలెన్నో
అక్షరాలు కొన్నైనా కావ్యాలెన్నో.

చరణం :

జననంలోన కలదువేదన
మరణంలోనూ కలదు వేదన-ఆ
వేదనలోన ఉదయించే-నవ
వేదాలెన్నో నాదాలెన్నో. ॥స్వరములు॥

చరణం:

నేటికి రేపొక తీరని ప్రశ్న
రేపటికీ మరునాడొక ప్రశ్న
కాలమనే గాలానికి చిక్కి-
తేలని ప్రశ్నలు ఎన్నెన్నో-ఎన్నెన్నో. ॥స్వరములు॥

చరణం :

కనులున్నందుకు కలలు తప్పవు
కలలున్నపుడు పీడకలలు తప్పవు
కలలవెలుగులో కన్నీరొలికే
కలతలనీడలు ఎన్నెన్నో-ఎన్నెన్నో. ॥స్వరములు॥

---

## 147

పల్లవి :

అతడు : మారాలి మారాలి
మనుషుల నడవడి మారాలి
తరతరాలుగా మారనివాళ్ళను
మీ తరమైనా మార్చాలి.

ఆమె : మారాలి మారాలి
మనుషుల గారడి మారాలి
మెప్పులకోసం చెప్పేవాళ్ళను
మీ తరమైనా మార్చాలి.

చరణం :

అతడు : అందరు దేవుని సంతతికాదా !
ఎందుకు తరతమభేదాలు ?

ఆమె : అందరి దేవుడు ఒకడే అయితే
ఎందుకు కోటి రూపాలు ?

అతడు : అందరి రక్తం ఒకటే కాదా !
ఎందుకు కులమతభేదాలు ?

ఆమె : అందరి రక్తం ఒకటే అయితే
ఎందుకు రంగుల తేడాలు ? ॥మారాలి॥

చరణం :

ఆమె : తెలిసి తెలిసీ బురదనీటిలో
ఎవరైనా దిగుతారా

అతడు ; ఆ బురదలోనే అందాల కమలం
పుడుతుందని మరిచేరా

ఆమె : కమలంకోసం బురదలోనే
కాపురముండే దెవరూ ?

అతడు : మనసులోని బురద కడుగుకొని
మనుషుల్లా బ్రతికేవారు
సమధర్మం చాటేవారు
వారిదే ఈనాటి తరం
వారిదే రానున్న యుగం
కాదనేవారు-ఇంకా
కళ్ళుతెరవనివారు
మేలుకోక తప్పదులే
మారిపోక తప్పదులే.

॥మారాలి॥

## 148

పల్లవి :

పరమశివుని మెడలోన పాము అన్నది
గరుడా క్షేమమా !
శివుని మెడలో వున్నంతవరకు
క్షేమమేసుమా !
అన్నాడు గరుడుడు
నవ్వుకున్నాడు శివుడు !

చరణం :

అల్పుడెపుడు పలుకుతాడు
ఆర్భాటంగా
సజ్జనుడు మాటాడును
చల్లచల్లగా
కంచు మ్రోగునట్లు
కనకంబు మ్రోగునా
అన్నాడు వేమన్న
అదే నిజం ఓరన్న ! ॥పరమ॥

చరణం :

కమలాలే నీటినుండి
తొలగిపోతే-ఆ
కమలాత్ముని కిరణాలకు
కమిలిపోతాయిలే
తమతమ నెలవులుతప్పిన
తమ మిత్రులే శత్రులనీ

అనెను సుమతిశతకం

అది శాశ్వత సత్యం ॥పరమ॥

చరణం :

రెండుకళ్ళు చూసేది ఒకేచూపు

రెండుకాళ్ళు నడిచేది ఒకేవైపు

ఆ కళ్ళు రెండు కలహమాడుకుంటే

ఆ కాళ్ళు రెండు కలిసి నడువకుంటే

ఇంకెక్కడి దృశ్యం !

ఇంకెక్కడి గమ్యం !

అన్నది ఈ కవిహృదయం

అది తెలుసుకుంటె అభ్యుదయం. ॥పరమ॥

## 149

పల్లవి :

మంచిని సమాధి చేస్తారా ! అది
మనుషులు చేసే పనియేనా !
మనలో పాపం చేయనివాడూ
ఎవడో చెప్పండి ?
ఏ దోషం లేనివాడూ
ఎవడో చూపండి ?

చరణం :

కత్తితో ఛేదించనిదీ
కరుణతో ఛేదించాలి
కక్షతో కానిది-క్షమా
భిక్షతో సాధించాలి
తెలిసీతెలియక కాలుజారితే
చేయూతనిచ్చి నిలపాలి
మనలో కాలుజారనివారూ
ఎవరో చెప్పండి ?
లోపాలు లేనివారూ
ఎవరో చూపండి ? ॥మంచిని॥

చరణం :

గుడులలో లింగాలను మింగే
బడాభక్తులు కొందరు
ముసుగులలో మోసాలుచేసే
మహావ్యక్తులు కొందరు
ఆకలితీరక నేరంచేసే
అభాగ్యజీవులు కొందరూ

మనలో నేరం చేయనివాడూ
ఎవడో చెప్పండి ?
ఏ దోషం లేనివాడూ
ఎవడో చూపండి? ॥మంచిని॥

చరణం :

తప్పుచేసిన ఈ దోషినీ
ఇప్పుడే శిక్షించాలి
మరపురాని గుణపాఠం-పది
మందిలో నేర్పించాలి
అయితే—
ఎన్నడు పాపం చేయనివాడూ
ముందుగ రాయి విసరాలి.
మీలో పాపం చేయనివాడే
ఆ రాయి విసరాలి
ఏ లోపం లేనివాడే
ఆ శిక్ష విధించాలి. ॥మంచిని॥

## 150

పల్లవి:

హెయ్ ! పబ్లిక్‌రా !
ఇది అన్నీ తెలిసిన పబ్లిక్‌రా !
అహ ! అసలూ తెలుసు
అరె ! నకిలీ తెలుసు
అందరి గోత్రం తెలుసు.

చరణం :

మచ్చికచేస్తే గంగిగోవులా
పాలందిస్తుందీ-ఇది
రెచ్చిపోతే కోడెతాచులా
ప్రాణం తీస్తుంది.
నమ్మితే జేకొడుతుంది
నచ్చితే జోకొడుతుంది.
మనసు కరిగితే
మనసిస్తుంది. ॥పబ్లిక్‌రా॥

చరణం :

కబుర్లు చెప్పి కడుపులునింపే
కాలంపోయిందీ
సందేశాలూ దిగుమతిచేసే
సమయం దాటిందీ
మాటలకిన్న-చేతలుమిన్న
కాదంటే మీ బ్రతుకులు సున్న. ॥పబ్లిక్‌రా॥

చరణం :

దాచుకొౕండిరా పెట్టెలనిండా
వెండీబంగారం
దాచేస్తారా తిండిగింజలను
ఎక్కడిదీన్యాయం !
మా ఆకలిముందు
మా అలజడి ముందు
దోపిడిదొౕరల ఆటలు బందు. ॥పబ్లిక్ రా॥

## 151

పల్లవి :

పారే నీటికి పరుగే అందం
పాడే పాటకు స్వరమే అందం
కల్లాకపటం ఎరుగని పిల్ల
అల్లరిచేస్తే అందం
అదే కన్నవారికానందం.

చరణం :

పరుగులుతీసే ఆ నీరూ
వరదగ మారితె ఏమౌను?
ఏమో !
ఊరూ నాడూ ముంచేస్తుంది-అది
పైరూపాపల కాజేస్తుంది.
అందుకని—
హద్దులోన ఉంటేనే
అల్లరి మీకు ఆనందం
అదే కన్నవారికానందం.

చరణం :

గులాబిపూలూ ఏమంటున్నాయ్ ?
ఏమంటున్నాయ్ ?
ఘుమఘుమలాడుతు
జడలో పాడుతు
ఉంటామంటున్నాయి
మరి-గులాబీముళ్ళూ

ఏమంటున్నా యేమంటున్నాయి ?
ముట్టుకుంటే గుచ్చుకుంటానంటున్నాయి
అందుకనే—
ముళ్ళలాగ ఎవ్వరిని నొప్పించవద్దు
పూలలాగ అందరిని మురిపిస్తే ముద్దు
కల్లాకపటం ఎరుగని పిల్లలు
అల్లరి మానితె అందం
పాడే పాటకు స్వరమే అందం
అదే కన్నవారికానందం. ॥పాడే॥

సాకీ :

అతడు : బాలభారతి నుదుట చిమ్మిన రక్తం
భావిభారతి ఎదను మాయని గాయం
సిలువపైన ఏసుక్రీస్తు
చిందించిన రక్తమిది !
శిలల దెబ్బలకు మహమ్మదు
ఒలికించిన రక్తమిది !
గుండు దెబ్బతో గాంధీ
గుండెనుండి చిందిన రక్తమిది !
చెప్పండి ఈ రక్తం కులమేదో-మీరే
చెప్పండి ఈ రక్తం మతమేదో

పల్లవి :

పాడవోయి భారతీయుడా !
పాడవోయి భారతీయుడా !

చరణం :

భరతావని వృక్షమనీ
ప్రాంతాలే కొమ్మలనీ
సమభావం మూలమనీ
సమైక్యతే ఫలమనీ. ॥పాడవోయి॥

చరణం :

ఆమె : ఎవరుహిందువెవరుముస్లి
మెవరురా కిరస్తానీ ?
ఎవరిది తెలుగెవరిదాంగ్ల
మెవరిది హిందుస్తానీ ?

1''''

అతడు : ఒకేచోట వికసించిన
రకరకాల పువ్వులురా.

ఆమె : ఒకేవాణి గుడిలో-వెలు
గొందిన మణిదివ్వెలురా. ॥పాడవోయి॥

చరణం :

అతడు : వేల చుక్కలున్నా
వెలుతురొక్కటేసనీ

ఆమె : కోవెలలేవైనా
దైవమొక్కటేననీ

అతడు : మానవతను నిర్మించని
మతం మృతమనీ

ఆమె : మనిషిని మనిషిగ తీర్చని
కులం వ్యాకులమనీ. ॥పాడవోయి॥

చరణం :

ఆమె : హిందువు తాగేనీరు వేరా ?
ముస్లిం పీల్చే గాలి వేరా ?

అతడు : కిరస్తాని చూసే వెలుగు వేరా ?
సిక్కులు నడిచే నేల వేరా ?

ఆమె : పార్సీలపైనున్న ఆకాశం వేరా ?

అతడు : బౌద్ధుల సూర్యుడు వేరా ?

ఆమె : జైనుల చంద్రుడు వేరా ?

అతడు : ఒకేసూర్యుడొకేచంద్రుడు
డొకేగాలి ఒకేనీరు
ఒకే నేల ఒకే నింగి
అయినపుడు-

ఆమె : ఎందుకిన్ని వర్ణాలు ?
ఎందుకిన్ని వర్గాలు ?
ఎందుకిన్ని కులాలు ?
ఎందుకిన్ని మతాలు ?

అతడు : వద్దు వద్దు వద్దు—ఈ
అంతరాలు వద్దనీ
ఈ విభేదాలు వద్దనీ
అపార్థాలు వద్దనీ
ఏ అనర్థాలు వద్దనీ
భరతజాతి ఒక్కటేననీ
భరతజాతి ఒక్కటేననీ
పాడవోయి భారతీయుడా !
ఈ దేశం పరువును-కా
పాడవోయి భారతీయుడా !

అందరు : పాడవోయి భారతీయుడా !
పాడవోయి భారతీయుడా !

## 153

పల్లవి :

చదువురాని వాడవనీ
దిగులుచెందకు - మనిషి
మదిలోన మమతలేని
చదువులెందుకు
మంచువంటి మల్లెవంటి...
మంచిమనసుతో - జీ
వించలేని పనికిరాని
బ్రతుకులెందుకు

చరణం :

ఏమి చదివి పక్షులు - పై
కెగుర గలిగెను
ఏ చదువు వల్ల చేపపిల్ల
లీదగలిగెను
అడవిలోని నెమలికెవడు
ఆట నేర్పెను - కొమ్మ
పైని కోకిలమ్మ కెవడు
పాట నేర్పెను ||చదువు||

చరణం :

తెలివిలేని లేగదూడ
పిలుచును అంబాయని
ఏ మెరుగని చంటిపాప
ఏడ్చును అమ్మాయని
చదువులతో పనియేమి ?
హృదయమున్న చాలు
కాగితంపు పూలకన్న
గరికపువ్వే మేలు ||చదువు||

---

**ఆత్మబంధువు**

## 154

పల్లవి :

మాటలకందని భావాలు
మంచి మాటలు చెబుతాయి
కవితలకందని భావాలు
కంటిపాపలే చెబుతాయి.

చరణం :

వెన్నెల మాటాడునా ?
వెదజల్లును చల్లదనాలు
మల్లిక మాటాడునా ?
కురిపించును పరిమళాలు.
బాసరాని పాపాయి
బోసినవ్వు చాలదా ?
ఏనాడూ పలకని దైవం
ఈ లోకమునేలదా ? ॥మాటల॥

చరణం :

పిల్లగాలి పరుగులలో
వెల్లివిరియు గీతికలూ
కొండవాగు తరగలలో
కోటిరాగమాలికలూ
హృదయానికి చెవులుంటే
జగమంతా నాదమయం
కనగలిగిన మనసుంటే
బ్రతుకే అనురాగమయం. ॥మాటల॥

## 155

పల్లవి :

సంసారం - సాగరం
బ్రతుకే ఒక నావగా
ఆశే చుక్కానిగా
పయనించే ఓ నావికా!
ఎక్కడుంది ? ఎక్కడుంది ?
ఎక్కడుంది నీ తీరం ?

చరణం :

నడిపే ఒడుపుంటేనే – నావ సాగిపోతుంది
ముందుచూపు వుంటేనే - బ్రతుకు బాగుపడుతుంది.
బరువు మించిపోయిందా - నావకే ముప్పు
తెలిసి గోతిలో దిగితే - ఎవరిది తప్పు ? ఎవరిది తప్పు ?
॥సంసారం॥

చరణం :

నడిసంద్రం సుడిగుండం - నావను ముంచేసింది
కుమిలే నీ గుండెల్లో - కోతకోసి పోయింది.
సడలిన నీ చేతులతో - కడలినీదలేవు
గట్టు చేరుకోలేవు - మరి - ఊరుకోలేవు ॥సంసారం॥

చరణం :

ఎగిరే పక్షికి గమ్యం - ఎక్కడుందో తెలియదు !
తెగిన గాలిపటమెక్కడ - దిగుతుందో తెలియదు !
దిక్కులేని మనిషీ ! ఏ దిక్కున పడిపోయేవు
నీ శవాన్ని నువ్వే మోసుకుపోతున్నావు ॥సంసారం॥

చరణం :

చచ్చేట్టుగ పెనుగులాడి - సాధించిందేమిటి? ఒక
బిచ్చగాణ్ణి కన్న కీర్తి . దక్కింది నేటికి.
నువు నాటిన ఆ మొక్కకు - ఎవరు చీడపురుగు ?
ఎవరో ! ఎవరో ! అది నీ అంతరాత్మ నడుగు ॥సంసారం॥

---

## సంసారం - సాగరం

## 156

పల్లవి :

గోవింద అనరా ! గోపాల అనరా !
అనుకుంటె అంతా మాయరా నరుడా !
అంతా మాయరా !
వినకుంటె నీదే ఖర్మరా నరుడా ! నీదే ఖర్మరా !

చరణం :

దొరలంతా గజదొంగల్లా-దోచుకుతింటే
దొంగలేమొ దొరబాబుల్లా-తిరుగుతువుంటే
దొరలు ఎవరో-దొంగలు ఎవరో
తెలుసుకొంటె-వారే వీరు వీరే వారు
అంతా ఒకటేరా ! ॥గోవింద॥

చరణం :

పులివేటకు వచ్చిన బంటు–పిల్లిని కొట్టీ
ఆ బంటే కొంతసుతవ్వి–ఎలకను పట్టీ
దిక్కులుచూచీ ఏమి లాభం ?
తెలుసుకొంటె పిల్లీ బెబ్బులి
ఎలుకా ఏనుగు ఒకటేరా ! ॥గోవింద॥

చరణం :

గుడికట్టి పూజలుచేసే దాసుడు ఒకడు
గుడినీ లింగాన్నీ మింగే భ్రష్టుడు ఒకడు
ఇది కలికాలం ! మాయాజాలం !
తెలుసుకుంటె తెలుపూ నలుపూ
తీపి చేదూ అంత ఒకటేరా ! ॥గోవింద॥

---

## 157

పల్లవి :

తాగుబోతు నయంరా! తమ్ముడూ! ఈ
పగాకోరు పుండాకోరు యదవలకంటే
తాగుబోతు నయంరా తమ్ముడూ! అందుకే
మళ్ళీమళ్ళీ తాగుతున్నాను-నా
మండే గుండెను పిండి-మరీమరీ తాగుతున్నాను.

చరణం :

నెత్తిలోనే విషముంటుంది పాముకు
తోకలోనే విషముంటుంది తేలుకు
నిలువెల్లా విషమేరా నీచులకు-ఆళ్ళకు
అందుకే చావురాదు యెన్నాళ్ళకూ. ॥తాగుబోతు॥

చరణం :

దేవుడేం చేస్తున్నాడో
ఈ యదవలకేమెరుకా!
ఈ యదవలేం ఏడుస్తున్నారో
ఆ వెర్రితండ్రికేమెరుకా!
దిట్టంగా మందుకొట్టి-ఆ
దేవుడే దిగివస్తే
బట్టబయలవుతుందీ
ఊరకుక్కల కుళ్ళు
పూరికుక్కల కుళ్ళు. ॥తాగుబోతు॥

చరణం :

తాగుబోతు తాగేది సారాయి
పుత్త సారాయి
దొంగనాయాళ్ళు తాగేదీ నెత్తురు
మనుషుల నెత్తురు-మంచోళ్ల నెత్తురు
మనుషుల నెత్తురుతాగ్నే-ఆ పెద్ద మనుషులకంటే
తాగి తూగి పడి చెడి
తనకుతానుగా చచ్చే-
తాగుబోతు నయంరా తమ్ముడూ! ॥తాగుబోతు॥

పల్లవి :

ఆడది కోరుకునే వరాలు - రెండే రెండు
చల్లని సంసారం
చక్కని సంతానం.

చరణం :

కాపురమే ఒక మందిరమై
పతియే తన దైవమై
అతని సేవలో తన బ్రతుకే
హారతియైపోతే
అంతకు మించిన సౌభాగ్యం
ఆడదానికేముంది? ॥ఆడది॥

చరణం :

ఇల్లాలే ఒక తల్లియై
చల్లని మమతలపాలవెల్లియై
తన పాప లాలనలో-తాను కరగిపోతే
అంతకు మించిన ఆనందం
ఆ తల్లికేముంది ? ॥ఆడది॥

---

రాధమ్మ పెళ్ళి

## 159

పల్లవి :

పారే గోదావరిలా - పరుగెత్తేదే వయసు
పొడిచే తొలిపొద్దులో - పొరలు లేనిదే మనసు.

చరణం :

గుండెలో సుడిగుండాలున్నా
నిండుగ నవ్వును ఏరు
పక్కలోన బురదవున్నా
పచ్చగ నవ్వును పైరు.
ఏ వెతలున్నా ఏదేమైనా
అలా అలా-కిలా కిలా
నవ్వేదే జీవితం. ॥పారే॥

చరణం :

వేటకాడు పొంచుంటాడనీ
గూటిలో గువ్వదాగదు
గొడ్డలివేటు పడుతుందనీ
కొమ్మ ఎదగడం మానదు.
ఎవరేమన్నా ఎదురేమున్నా
అలా అలా-గలాగలా
సాగేదే జీవితం. ॥పారే॥

చరణం :

నిప్పుతొక్కితే కలిగేబాధ
కట్టుకట్టితే పోతుంది.
పాము కరిస్తే ఎక్కే విషం
పసరుతో దిగిపోతుంది.
కానీ
మనిషికాటుకూ మందులేదని
తెలుసుకొని మసలుకొని
ఉండేనే జీవితం. ॥పారే॥

---

## 160

సాకీ :

అల్లాయే దిగివచ్చి
అయుమయా ! ఏమి కావాలంటే
సిద్దెలొద్దూ మేడలొద్దూ
పెద్దలక్కే గద్దెలొద్దంటాను
ఉన్ననాడూ ఏనినాడు
ఒకే ప్రాణమై నిలిచే
ఒక దోస్తే చాలంటాను
ఒక్క నేస్తం కావాలంటాను.

పల్లవి :

స్నేహమే నా జీవితం
స్నేహమేరా శాశ్వతం !
స్నేహమే నాకున్నది
స్నేహమేరా పెన్నిధి!

చరణం :

గుండెనే పలికించితే
కోటిపాటలు పలుకుతాయి
మమతనే పండించితే
మణుల పంటలు దొరుకుతాయి
బాధలను ప్రేమించు భాయీ!
లేదు అంతకుమించి హాయి. ॥ స్నేహమే॥

చరణం :

కత్తిలా పదునైన చురుకైన మావాడు
మెత్తబడిపోయాడు ఎందుకో ఈనాడు

ఏమిటో నీబాధ నాకైన చెప్పు భాయీ !
ఆ రహస్యం కాస్త ఇకనైన విప్పవోయీ !
నిండుగా నువ్వు నేడు నవ్వాలి
అందుకు నేనేమి ఇవ్వాలి ?
చుక్కలను కోసుకొని తెమ్మంటావా !
దిక్కులను కలిపేయమంటావా !
దింపమంటావా ఆ చంద్రుణ్ని !
తుంచమంటావా ఆ సూర్యుణ్ని !
ఏమి చేయాలన్నా చేస్తాను
కోరితే ప్రాణమైనా ఇస్తాను.
దోస్తీకి నజరానా
చిరునవ్వురా నాన్నా!
ఒక్క నవ్వే చాలు
వద్దులే పరహాలు
నవ్వేరా మావాడు
నవ్వేరా నిండుగా
నవ్వేరా నాముందు
రంజాను పండుగ.

॥స్నేహమే॥

## 161

పల్లవి :

నందామయా ! గురుడ !
నందామయా !
ఉందామయా ! తెలుసు
కుందామయా !

చరణం :

మెరిసే సంఘం మేడిపండు–దాని
పొట్టవిప్పిచూస్తే పురుగులుండు
ఆ కుళ్లులేని చోటూ–యిక్కడే
అనుభవించు రాజా ! యిప్పుడే
ఆనందసారం యింతేనయా ! ॥నందామయా॥

చరణం :

పుట్టినప్పుడూ–బట్టకట్టలేదు
పోయేటప్పుడు అది–వెంటరాదు
నడుమ బట్టకడితే–నగుబాటు
నాగరికం ముదిరితే–పొరపాటు
వేదాంతసారం యింతేనయా ! ॥నందామయా॥

## 162

పల్లవి :

కదిలింది కదిలింది యువతరం!
ఎదురులేని బెదురులేని నవతరం!
కాగడాలుగా కదిలే ఈ చైతన్యం
కారుచీకటుల చీల్చే కాంతిసైన్యం
ఇదే క్రాంతిసైన్యం!

చరణం :

విద్యార్థులు పుస్తకాల పురుగులుకారు
పెద్దల పీఠాలకు-బలిపశువులుకారు
ఆత్మవికాసంకోసం-పాఠాలను చదువుతారు
అవసరమైతే-గుణపాఠాలను చెబుతారు. ॥కదిలింది॥

చరణం :

బానిసతనమును నేర్పే-బడులు బడులుకావు
పిరికిమందు పోసే ఆ- గుడులు గుడులుకావు
ఆత్మశక్తి దీపించే-అభ్యుదయం చూపించే
పాఠశాలలే మంచిని పలికించే మందిరాలు
మానవతామందిరాలు. ॥కదిలింది॥

చరణం

అడుగడుగున డిటెక్షన్ల-ఆటలింక సాగవులే
మొగ్గలోనే తుంచేసే-మూర్ఖత్వం చెల్లదులే
త్యాగాలకు వెనుకాడక-లాఠీలకు తలవంచక
తుదిదాకా పోరాటం సాగిస్తాం
హక్కులు సాధిస్తాం. ॥కదిలింది॥

---

స్త్రీ

## 163

పల్లవి :

ఇదికాదు మా సంస్కృతి
ఇదికాదు మా ప్రగతి

చరణం :

ఉయ్యాలలూగే వయసులో
సయ్యాటలాడే మనసులో
వెచ్చని తలపులు తొందరపడినా
పచ్చని పందిట పిలుపుకోసం
మంచున తడిసిన-మల్లెపువ్వులా
వేచివుండుటే వేడుక-ఒక కన్నెకు ఒకే కోరిక
అదే అదే మా సంస్కృతి-అదే అదే మా ప్రగతి.

చరణం :

కులసతిగా పతినారాధించి
తొలినోముల పంటలే పండించి
అతడుండే కారడవే
నందనవనిగా భావించి
పతిదేవుని అనుసరించుటే
సతీమతల్లికి పరమార్థం
ఒక సీతకు ఒకే రాముడు ॥అదే అదే॥

చరణం :

ఇల్లాలుగా ఇంటికి వెలుగై
కన్నతల్లిగా పాపల పెంచి
సత్యం—ధర్మం—శౌర్యగుణం
నిత్యసూక్తులు బోధించి
జాతిరక్షణకు చిరంజీవులను
తీర్చిదిద్దుటే ఆశయం
ఒక తల్లికి ఒకే ఆశయం. ॥అదే అదే॥

---

## దేశోద్ధారకులు

# 164

పల్లవి :

ఈనాడే దసరా పండగ
ఈనాడే దసరా పండగ.
అన్ని వృత్తుల శ్రామికశక్తుల
ఆయుధపూజల పండుగ.

చరణం:

పొలిమేరలలో పొంచియున్న పెను
దుండగీడుల గుండెలుచీల్చే
కత్తికి పూజ ఈనాడే.
కత్తికి పూజ ఈనాడే.
ఫ్యాక్టరీలలో ఇనుమునుకాచీ
పరికరాలుగా తీరిచిదిద్దే
సుత్తి కిపూజ ఈనాడే
సుత్తికి పూజ ఈనాడే.
రాళ్ళను చీల్చి బీళ్ళను దున్ని
రతనాల పంట పండించే
నాగలిపూజ ఈనాడే
నాగలిపూజ ఈనాడే.

చరణం :

పందలాది ఎకరాలకు యికపై
వారసుడొకడే ఉండడులే-అవి
ఊరందరికీ చెందునులే.

నోట్లబలంతో కులికేవాడికి
నూకలుకూడ పుట్టవులే-నల్ల
రూకలు అన్నంపెట్టవులే.
చెమట వడిపి పనిచేసేవాడే
శిరసెత్తుకు తిరుగునులే.
పరువుగ బ్రతుకును గడుపునులే.
దరిద్రమన్నది ఈ దేశంలో
దరిదాపులలో నిలవదులే
ఈ పరిణామం ఇక తప్పదులే
తప్పదులే తప్పదులే తప్పదులే. ॥ఈనాడు

పెద్దకొడుకు

## 165

సాకీ :

అతడు : ఎక్కడికో ?

ఆమె : తమరెక్కడికో ?

అతడు : చెప్పనా ?

ఆమె : ఊఁ !

పల్లవి :

అతడు : నువ్వూ నేనూ—నడిచేదీ ఒకే బాట ! ఒకే బాట !

ఆమె : నువ్వూ నేనూ-పలికేది ఒకేమాట ! ఒకే మాట !

అతడు : ఆ బాట ఏనాడు తిరుగులేనిది

ఆమె : ఆ మాట ఏనాడు తీరిపోనిది !

చరణం :

అతడు : దూరాన శిఖరాలు వున్నాయి-వాటిని
చేరుకునే పాదాలను రమ్మన్నాయి.

ఆమె : తూరుపున కిరణాలు ఉదయించాయి-గగన
తీరాలను అందుకోను పయనించాయి.

అతడు : మరి మన పయనం ఎందాక ? ఎందాక ?

ఆమె : ఆ శిఖరాలూ తీరాలూ అందేదాకా. ॥నువ్వూ॥

చరణం :

అతడు : చిరుగాలిలో ఏవో-నాదాలు వున్నాయి

ఆమె : అవి మురళిలో చేరితేనె రాగాలు ఔతాయి.

అతడు : వానచినుకుల్లోన కనరాని-తళుకులున్నాయి

ఆమె : అవి ముత్తెపుచిప్పల్లో పడితేనే-ముత్యాలు అవుతాయి

ఇద్దరు : మంచి ఆశయాలుంటే మానవులందరూ
మచ్చలేని వెలుగునే చేరుకొందురు. ॥నువ్వూ॥

---

డబ్బుకు లోకం దాసోహం

పల్లవి :

మనసే మనిషికి తీయని వరమూ
మనసులేని బ్రతుకే తీరని శాపమూ
తీరని శాపమూ !

చరణం :

నిట్టూర్పుల సుడిగాలి విసిరినా
కన్నీటి జడివాన కురిసినా
విధి నెదిరించి మనిషి నిలనాలి
అందుకే మనిషికి నిండుమనసు కావాలి
నిండుమనసు కావాలి ॥మనసే॥

చరణం :

పశువులకుంటాయా పరీక్షలూ
రాళ్ళకు పడతాయా శిక్షలు
మనిషి అన్నవాడికే శిక్షలూ పరీక్షలూ
అందుకే మనిషికీ నిండు మనసు కావాలి
నిండు మనసు కావాలి ॥మనసే॥

చరణం :

లోకులు కాకులై పొడిచినా
కాలం నిప్పులే చెరిగినా
చిరునవ్వే తోడుగా జీవించగలగాలి
అందుకే మనిషికీ నిండు మనసు కావాలి
నిండు మనసు కావాలి ॥మనసే॥

---

పవిత్రహృదయాలు

## 167

పల్లవి :

ఆలయమేలా !
అర్చనలేలా !
ఆరాధనలేలా !
పతిదేవుని పదసన్నిధి
మించినది వేరే కలదా
అదే సతిపెన్నిధి కాదా!
అదే పరమార్థం కాదా !

చరణం :

ఏ కొండ కొమ్ముపైనో
ఏ రాతిబొమ్మలోనో
దైవము దాగెనంటూ
తపియించనేలా
ఆ దైవం నిజముగ ఉంటే
అడుగడుగున తానై వుంటే
గుడులేల యాత్రలేలా ! ॥ఆలయమేలా॥

చరణం :

పైపైని మెరుగులకోసం
భ్రమచెందు గుడ్డిలోకం
మదిలోన వెలిగే అందం
గమనించునా
ఈ లోకులతో పనియేమి ?
పలుగాకులు ఏమంటేమి ?
నా స్వామి తోడురాగా. ఆలయమేలా॥

## 168

పల్లవి :

మనిషిని నమ్మితే-ఏముందిరా !
మట్టిను నమ్మినా-ఫలితముందిరా ! నాన్నా !

చరణం :

తీవను పెంచితే పూలిస్తుందిరా
గోవును పెంచితే పాలిస్తుందిరా !
పాముకు మొక్కుకుంటె-పక్కకు తొలగునురా
మనిషిని నమ్ముకుంటె-పచ్చివిషం దొరకునురా. ॥మనిషిని॥

చరణం :

కుడిచిన పొదుగును-పొడిచేవారున్నారు
పెట్టిన చేయినే-విరిచేవారున్నారు
బంధువులని చెప్పుకునే-రాబందులున్నారు
మేకవన్నె పులులూ—ఈ
లోకమంతా ఉన్నారు
ఈ లోకమంతా ఉన్నారు. ॥మనిషిని॥

చరణం :

మెత్తగ మసులుకుంటె-మెతుకు పుట్టదు
మంచికి ఈ లోకం విలువకట్టదు !
ఏటికి ఎదురీదనిదే-గట్టు దొరకదు
ఎత్తుకు పైయెత్తులేక-ఏదీ జరగదు. ॥మనిషిని॥

---

రైతుబిడ్డ

## 169

పల్లవి :

విద్యార్థులు నవసమాజనిర్మాతలురా !
విద్యార్థులు దేశభావినిర్ణేతలురా !
వినోదాలు చూపినా విప్లవాలు రేపినా
అన్నిటికీ పైచేయి యువతరానిదే-ప్రగతి
ఆగిపోవు విద్యార్థులు ముందులేనిదే.

చరణం :

బుక్స్ ! బుక్స్ ! బ్లడీ బుక్స్ !
లుక్స్ ! లుక్స్ ! ప్రెటీ లుక్స్ !
కారిడార్లో కాసేపు
క్యాంటీన్లో కాసేపు
గర్ల్‌ఫ్రెండ్సుతో కాసేపు
గడిపిందే స్టూడెంట్‌లైఫు.
గంటలకొద్దీ క్లాసురూంలో
అంటుకు ఉంటే ఇరకాటం
ఎపుడోవచ్చే పరీక్షకోసం
ఇపుడే ఎందుకు జంజాటం!

చరణం :

చదువే నా ఆహారం
చదువే నా పానీయం
విద్యాదాత నా దైవం
విద్యాలయం నా దేవాలయం.
సంఘంతో పుడిలేదు
సమ్మెలతో పనిలేదు
మీటింగులంటే అమ్మో ! భయం !
పాఠాలంటే మహాప్రియం.

చరణం :

సహనం నా కవచం
శాంతం నా శస్త్రం

అహింసయే మన జాతికి
అందిన పరమార్థం
ఒక చెంపను కొడితే-ఇం
కొక చెంపను చూపాలి
సర్వోదయ మార్గంలో
సమతను సాధించాలి.

చరణం :

ఇది కుళ్ళిన సంఘం
వయసుమళ్ళిన సంఘం-దీని
కీళ్ళు విరిచివేయాలి
వేళ్ళు నరికివేయాలి.
పెన్నులు విడిచిపెట్టి-హుం
గన్నులు చేతపట్టి
పెత్తందారుల బద్దలుకొట్టాలి-పచ్చి
నెత్తురులో కొత్తజగతి పుట్టాలి.

చరణం :

చదువులంటే పెదవివిరిచే-సరదా జీవి ఒకడు
పుస్తకమే సమస్తమనే-చాదస్తపు యువకుడు ఒకడు
వల్లమాలిన సౌజన్యంతో-చల్లారినవాడొకడు
ఉద్రేకంలో ఉనికిని మరచిన-ఉగ్రవాది ఇంకొకడు
నలుగురిలో కలవు-కొన్ని లోపాలు
నలుగురిలో కలవు ఎన్నో సుగుణాలు
ఈ నలుగురి సుగుణాలు ఏకమైననాడు
ఆదర్శ విద్యార్థి అవతరించుతాడు !
అతడే మన దేశానికి ఆశాదీపం !
విశ్వశాంతి కొసగునోయి అభినవరూపం-అతడు
విశ్వశాంతి కొసగునోయి అభినవరూపం.

## 170

పల్లవి :

అతడు : చదువూ సంపద అందరిదీ
పాడీపంటా అందరిదీ

ఆమె : పరువుగ బ్రతికే జన్మహక్కు-
మనిషి అన్న ప్రతివానిదీ.

చరణం :

అతడు : విధిని నమ్ముకొను రివాజులు
ఎన్నాళ్ళు ? ఇంకెన్నాళ్ళు ?

ఆమె : వేలిముద్రల రోజులు
ఎన్నాళ్ళు ? ఇంకెన్నాళ్ళు ?

అతడు : ఎవరి జీవితం వారు దిద్దుకొని
తెలివి పెంచుకోవాలి

ఆమె : అందరూ బాగా చదువుకొని-మా
అయ్యకు బుద్ధి చెప్పాలి-బా
బయ్య భరతం పట్టాలి.

చరణం :

అతడు : హరిజనులు గిరిజనులూ
అందరు నేడు పురజనులే

ఆమె : ఉన్నవారికే చదువులనే-ఆ
నమ్మకాలు ఇక చెల్లవులే

అతడు : బడియే సరికొత్త తరానికే
గుడిలాంటిదని చాటాలి

ఆమె : బడినీ గుడినీ మింగేవాళ్ళను
బజారులో నిలదీయాలి.

# 171

పల్లవి :

ఎవరు వీరు ? ఎవరు వీరు ?
దేశమాత పెదవిపైన-మాసిన చిరునవ్వులు !
మనసులేని పిశాచిలిలో-నలిగిపడిన పువ్వులు !
ఎవరు వీరు ? ఎవరు వీరు ?

చరణం :

ఆకలికమ్ముడుపోయిన-అపరంజిబొమ్మలు
చెక్కిలి వన్నెలు చెరిగిన-చిగురాకురెమ్మలు
ఎవరు వీరు ? ఎవరు వీరు ?

చరణం :

పొరపాటున అబలలుగా-పుట్టిన విధివంచితులు
బుసకొట్టే కామాగ్నికి-విసిరేసిన సమిధలు
ఎవరు వీరు ? ఎవరు వీరు ?

చరణం :

కన్నెలుగానే పాపలగన్న వింతతల్లులు
రొమ్ముకింద మమతలణచుకున్న పాలవెల్లులు
ఎవరు వీరు ? ఎవరు వీరు ?

చరణం :

కసిదాగిన కళ్ళు ! సలసల కాగిన కన్నీళ్ళు !
నవ్వలేక, ఏడ్వలేక-నిట్టూర్చే శవాలు !
నడిచే జీవచ్ఛవాలు !
ఎవరోకాదు-వీరెవరోకాదు
ఆ దేవుడు సృష్టించిన పడతులు
ఈ మనిషే దిగజార్చిన పతితలు
ఎవరో తెలుసా ? వీరెవరో తెలుసా ?
మన రక్తం పంచుకున్న ఆడపడుచులు
మనం జారవిడుచుకున్న జాతి పరువులు !
ఈ ఆడపడుచులు-మన జాతి పరువులు !

---

మానవుడు-దానవుడు

## 172

పల్లవి :

పదరా ! పదరా !
నడుంకట్టి పిడికిలెత్తి పదరా !
నవవిప్లవశంఖమూది పదరా !
పడగెత్తే స్వార్థపరుల
అడుగడుగున తరిమికొట్టి పదరా !
మంచిరోజులొచ్చాయి పదరా !

చరణం :

చెమటోడ్చి పనిచేయని
సోమరులకు చోటులేదురా !
పదుగురితో కలిసిరాని
బాబులకిక బతుకులేదురా !
గునపమెత్తి-సుత్తిపట్టి
కొండలనే పిండికొట్టి
నదులను మళ్ళించుదాము పదరా ! రత
నాలను పండించుదాము పదరా !
మంచిరోజులొచ్చాయి పదరా !

## 173

పల్లవి :

ఈ మట్టిలోనే పుట్టాము
ఈ మట్టిలోనే పెరిగాము
ఈ మట్టిని మించిన దైవంలేదు
మట్టే మెతుకురా ! ఈ
మట్టే బతుకురా !

చరణం :

బీడువడ్డ బంజరునేల
మేడిపట్టి రమ్మంటుంది
అర్రుసాచి కోడెగిత్త
కర్రుమునుగ దున్నుతుంది
నీరుపోసి నారువేసి
కలుపుతీసి సాగుచేసి
బంగారపు రాసులు యెన్నో
పండించాలిరా !
ప్రజలకందించాలిరా ! ॥ఈ మట్టి॥

చరణం :

ఎంత చెమట ధారపోస్తే
ఈ పచ్చని పైరుపండెరా !
ఎంత నెత్తురావిరైతే
ఈ ఫలితం చేతికందెరా !
గట్టుమీద కూరుచుంటే
పొట్టనింపే వాడెవడురా !
రాజ్యాలే తలకిందైనా
రైతే మిగులురా ! మన
జాతే వెలుగురా !

చరణం :

కలిసిమెలిసి బతికిననాడే
కష్టాలే తొలుగునులేరా !
కలలన్నీ పండును లేరా !
పల్లెసీమ చల్లగవుంటే
ప్రపంచమే నిలుచునులేరా !
ప్రగతి జగతి నిండును లేరా !
పదుగురికి కలిమిని పంచీ
అందరితో చెలిమి పెంచీ
తన గడ్డను తీరిచిదిద్దే
మనిషే మనిషిరా ! ఆ
మనసే మనసురా ! ॥ఈ మట్టి॥

# 174

పల్లవి :

అల్గా ! అల్లా !
అల్లా ! అల్లా !
ఏమిటయ్యా నీ లీల !
ఎందుకయ్యా ఈ తేడా !
అయ్యయ్యో నీ వింతసృష్టిలో
అంతా ఉల్టా సీదా !

చరణం :

ఒక చెట్టుకాయలు ఒకేరకం
ఒక తీగ పువ్వులు ఒకేరకం
ఒకే తల్లికి పుట్టినవారికి
బుద్ధులెందుకు తలా ఒక రకం? ॥అల్లా॥

చరణం :

కురిసే వానకు స్వార్థంలేదు
పండే పంటకు స్వార్థంలేదు
నింగికి నేలకు లేని స్వార్థం
మధ్య ఉన్న ఈ మనిషికెందుకు ? ॥అల్లా॥

చరణం :

పుట్టినప్పుడు పట్టుకురాడు
పోయేటప్పుడు పట్టుకుపోడు
మూడునాళ్ళ ముచ్చటకోసం
మోసాలెందుకు ? ద్వేషాలెందుకు ? ॥అల్లా॥

---

మహమ్మద్ బిన్ తుగ్లక్

## 175

పల్లవి :

ఒకటీ-రెండూ-మూడూ - విడి
విడిగావుంటే అంతే !
ఒకటిగ కలిపి చూడు – అవి
నూటఇరవై మూడు !
నూటఇరవై మూడు !

అనుపల్లవి :

ఎవరికి వారైతే ఏముంది ? ఏముంది ?
ఒకటై కలిసుంటే బలముందీ ! బలముంది!
కల్లమాటలే పలకొద్దు ! వద్దు ! అసలొద్దు !
కుళ్ళు పెంచుకొని బతకొద్దు ! వద్దు ! అసలొద్దు !
పరువు చంపుకొని-మనసు అమ్ముకొని
బతికే బతుకు మనకొద్దు
బతికే బతుకు మనకొద్దు.

చరణం :

నల్లని చీకటి నెరగకపోతే
తెల్లని వెలుగుకు విలువేదీ ! విలువేదీ !
ఆపదలన్నవి కలుగకపోతే
ఆనందానికి రుచియేదీ !
ఆనందానికి రుచియేదీ ! ॥ఒకటీ॥

చరణం :

మాకు తెలుసును ఈ సంఘం
మంచీచెడ్డల రణరంగం !
మనిషి మనిషిగా పురోగమిస్తే
మంచికే అంతిమ విజయం
మంచికే అంతిమ విజయం ! ॥ఒకటీ॥

## 176

పల్లవి :

ఎవరికీ తలవంచకు
ఎవరినీ యాచించకు
గుండెబలమే నీ ఆయుధం
నిండు మనసే నీ ధనం

చరణం :

కండలుపిండే కష్టజీవులకు
తిండికి కరువుంటుందా ?
నిజాయితీకై నిలిచేవారికి
పరాజయం వుంటుందా ?
మంచితనమ్మును మించిన పెన్నిధి
మనిషికి వేరే వుందా ? ॥ఎవరికీ॥

చరణం :

చాలీచాలని జీతంతో-మిడి
మేలపుకొలువులు కొలవకు
ముడుచుకుపోయిన ఆశలతో,
మిడిమిడి బ్రతుకును గడపకు
చీకటిరాజ్యం ఎంతోకాలం
చెలాయించదని మరువకు. ॥ఎవరికీ॥

చరణం :

జీవితమే ఒక వైకుంఠపాళీ
నిజం తెలుసుకో భాయీ !
ఎగరేసే నిచ్చెనలే కాదు
పడదోసే పాములు వుంటాయి
చిరునవ్వులతో విషవలయాలను
ఛేదించి ముందుకు పదవోయి ! ॥ఎవరికీ॥

# 177

పల్లవి :

అతడు : ఓ...ఓహోహో
పట్టండీ! నాగలి పట్టండీ !
కట్టండీ! నడుములు కట్టండీ !
జైజవానని-జైకిసానని
జాతిపేరు నిలబెట్టండీ !

చరణం : ముక్కచెక్కలైపోయిన నేలను
ఒక్కటిగా కలిపేయండి

అందరు : ఒక్కటిగా కలిపేయండీ !

అతడు : ఇసుక దిబ్బలను చవిటి పర్రలను
పసిడిపొలాలుగ చేయండీ !
పసిడిపొలాలుగ చేయండీ ! ॥పట్టండీ॥

చరణం :

కష్టజీవుల చెమటనీరు
ముందుతరాలకు పన్నీరు

అందరు : ముందుతరాలకు పన్నీరు

అతడు : కలసికట్టుగా మనం సాగితే
నిలిచిపోవురా మిన్నేరు
నిలిచిపోవురా మిన్నేరు ! ॥పట్టండీ॥

చరణం :

అతడు : కరువురక్కసి-కోరలువిరిచే
మరనాగళ్ళను వాడండీ !

అందరు : మరనాగళ్ళను వాడండీ !

ఆమె : మనిషీ యంత్రం ఒకటైపోతే
మట్టియె కనకమ్మౌనండీ ! ॥పట్టండీ॥

చరణం :

అందరు రైతులేనిదే రాజ్యంలేదని

అందరు : రొమ్ము విరిచి ముందుసాగండీ !

ఆమె : ఆంధ్రదేశము అన్నపూర్ణయని
అఖిలజగాలకు చాటండీ !
అఖిలజగాలకు చాటండీ ! ॥పట్టండీ॥

---

పల్లవి :

మనిషి తలచుకుంటే
గిరులు ఝురులుగా పొంగవా !
అవని దివికి ఉప్పొంగదా !

చరణం :

చంద్రబింబమున-పందిరివేసి
సూర్యగోళమున-పీఠంవేసి
గ్రహతారకల-గతులేమార్చి
కల్లోలం-కలిగించడా ! ॥మనిషి॥

చరణం :

గగనమండలము-తెగిపైబడినా
గరళజ్వాలలు-చుట్టుముట్టినా
సత్యాగ్రహమే-సాధనమ్ముగా
మృత్యువునే-ఎదిరించడా !

చరణం :

సప్తమరుత్తులు-సర్వసరిత్తులు
విక్రమించినా
ప్రళయాంబోధరచలచ్చంచలలు
విభ్రమించినా
దిక్పాలకులే ధిక్కరించినా
యక్షరాక్షసులు హుంకరించినా
మనిషి ఓడునా ! ప్రగతి ఆగునా !

## 179

పల్లవి :

కాపురం-కొత్తకాపురం
ఆలుమగలు కట్టుకున్న అనురాగగోపురం

చరణం :

పాకలో ఉన్నా అది పసిడిమేడగా
మండుటెండలో ఉన్నా మల్లెలనీడగా
ఉన్నంతలో చెప్పలేని-తీపిని అందించేది
గోరంతలో కొండంత-తృప్తినికలిగించేది ॥కాపురం॥

చరణం :

తనపతియే కనిపించే దైవమనీ
తనసతియే ఫలియించిన పుణ్యమనీ
ఒకరినొకరు తెలుసుకునీ-ఒకటిగా నడచుకొనీ
బ్రతుకంతా పచ్చదనం-అందించుకొనేదే ॥కాపురం॥

చరణం :

చీకటిలో చిరునవ్వులు వెలిగించుకొనీ
బాధలలో ఆనందం పంచుకొనీ
కలిమిలో పొంగక లేమిలో క్రుంగక
వెలుగునీడలొకట్టిగా కలబోసి చూసేదే ॥కాపురం॥

## 180

పల్లవి :

దివ్వీ దివ్వీ దివ్విట్లు-దీపావళి దివ్విట్లు
ఇంటింటా ఈపూట-ఎన్నో ఎన్నో ముచ్చట్లు

చరణం :

చేతులుకాల్చుకునే-సిసింద్రీలకన్నా
కళ్ళుజిగేలనే-మతాబాలకన్నా
నలుగురు కిలకిలా నవ్వినపుడే పండగ
ఉన్నంతలో కడుపునిండ-తిన్నపుడే పండగ ॥దివ్వీ॥

చరణం :

తారాజువ్వల్లా-ఎగిరెగిరి పడక
చిమ్మిన రవ్వల్లా-చెల్లా చెదురు కాక
ఒంటిగా కలసిమెలసి-ఉన్నపుడే పండగ
ఉన్నంతలో కడుపునిండ-తిన్నపుడే పండగ ॥దివ్వీ॥

చరణం :

అమావాస్య చీకటిలో-ప్రమిదలే వెలుగులు
అమ్మకు నాన్నకూ-పిల్లలే దివ్వెలు
పరువుగా ఆ పిల్లలు-బ్రతికినపుడె పండుగ
ఉన్నంతలో కడుపునిండ-తిన్నపుడె పండగ ॥దివ్వీ॥

---

సంసారం-సాగరం

# 181

పల్లవి :

జింజింతారా ! జింజింతారా ! జింతారా-అది
చెప్పేది చెవియొగ్గి యినుకోరా !

చరణం :

మనిషి పుట్టినది ఎందుకురా ?
మంచిని పెంచేటందుకురా
విద్దెలు నేర్చేదెందుకురా ?
బుద్ధులు పెరిగేటందుకురా
నలుగురిమేలు తలవనివాడు
ఉన్నా ఊడినా ఒకటేలేరా ! ॥జింజింతారా॥

చరణం :

కాకి నలుపు-కందెన నలుపు
చీకటి నలుపు-తాటకి నలుపు
పరులను దోచి-అరలో దాచే
పాపపుసొమ్ము కారునలుపు
ఈ నలుపంతా వదిలేదాకా
నీ గతి నా గతి ఇంతేరా ! ॥జింజింతారా॥

చరణం :

పచ్చని చేలే పల్లెకు అందం
చంటిపాపలే ఇంటికిఅందం
బొట్టూకాటుక బుల్లెమ్మకందం
సిగ్గూబిడియం చినదానికందం
అణుకువలేని ఆడదానికి
అందంఉన్నా దండగరా ! ॥ంజింతారా॥

ఊరికి ఉపకారి

## 182

పల్లవి :

ఆలూమగలూ ఒకటైవుంటే
ఆ యిల్లే ఒక స్వర్గం
అపోహలున్నా అపశ్రుతులున్నా
ఆ యిల్లే ఒక నరకం.

చరణం :

పెదవులు రెండూ కలిసినపుడే
హృదయం పాడుతుంది
పదములు రెండూ కదిలినపుడే
పయనం సాగుతుంది. ||ఆలూ||

చరణం :

చెణుకులు బెణుకులు వుంటేనే
సరదాగ వుంటుంది సంసారం
ముద్దూముచ్చట వుంటేనే
మోగునులే జీవనరాగం. ||ఆలూ||

చరణం :

భజనలతోనే-భక్తులు కారేరు
కొలిచే మనసుంటే-గుడితో పనిలేదు
ఆడదాని ఆత్మలోని-అనురాగమే ఆరాధన
అదే అదే నా సాధన. ||ఆలూ||

## 183

సాకీ :

అతడు : నాదేశం భగవద్గీత ! నాదేశం అగ్నిపునీత సీత !
నాదేశం కరుణాంతరంగ ! నాదేశం సంస్కారగంగ !

పల్లవి :

అతడు-ఆమె: ఎక్కడికెళుతూందీ ? దేశం ఏమైపోతూంది ?
హిమశైలశిఖరంపైకా ? పాతాళకుహరంలోకా ?

చరణం :

ఆమె : ప్రవచనాల పచ్చికబయళ్లలో-పన్నాగాలగోతులు
అతడు : ప్రణాళికల గాదెలకింద-దాక్కున్న పందికొక్కులు
ఆమె : పావురాళ్ళ ఈకలు తొడుక్కునీ-ఊరేగే రాబందులు
అతడు : ఇంకా-
పొద్దున చూరుకంటుకునే బల్లులై-మధ్యాహ్నం గోడమీద పిల్లులై
సాయంత్రం పూసరవెల్లులై-పార్టీలరంగులు ఫిరాయించే
అపకాశవాదులు-అటు రాబందులు
॥ఎక్కడి॥
ఆమె : ఇటు అవకాశవాదులు.

చరణం :

ఇద్దరు : ఉగ్గుపాలతో మతమౌఢ్యాలను రంగరించీ
కంచాలలో వర్ణభేదాలు వడ్డించీ
అతడు : జాతికి నల్లమందెక్కించే-మతోన్మాదులు ఒకవంక
ఆమె : మరోవంక-
శాంతీసహనం సౌహార్ద్రం-చచ్చురకం సంస్కారమనీ
వ్యక్తుల హత్యలతోనే-నేటి వ్యవస్థ మారితీరుతుందనీ
అతడు : అరాచకంగా పరిక్రమించే మహోగ్రవాదులు ఒకవంక-
మతోన్మాదులు ఒకవంక-
ఆమె : మహోగ్రవాదులు ఒకవంక-

చరణం :

అతడు : ధాన్యంలోనే కాదు-సౌజన్యంలోనూ కల్తీలు
ఆమె : నేతిలోనేకాదు-నీతిలోనూ కల్తీలు
అతడు : మైమరపించే మద్యంలో - మనుషుల చంపే కల్తీలు
ఆమె : ప్రాణంపోసే మందుల్లో-ప్రాణంతీసే కల్తీలు
అతడు : పరీక్షరాసే చేతుల్లో-''కాపీ'' కల్తీలు
ఆమె : ఉప్పెనలాంటి యువతరంలో-''హిప్పీ'' కల్తీలు.
అతడు : అటు దినుసుల కల్తీలు
ఆమె : ఇటు మనసుల కల్తీలు
ఇద్దరు : ధరల బరువుతో ప్రజల రెక్కలు విరుగుతూండే
తిండికరువుతో పేదల డొక్కలు మండుతూంటే.

చరణం :

అతడు : పదవులకై కుమ్ములాటలు-బిరుదులకై పెనుగులాటలు
ఆమె : భాషాదురహంకారాలు-ప్రాంతీయ హుంకారాలు
అతడు : దొంగసరకు రవాణాలు-నల్లడబ్బు విలాసాలు
ఆమె : విలువలేని నినాదాలు
అతడు : పనికిరాని పట్టాలు
ఆమె : అడుగడుగున లంచాలు
అతడు : పడగెత్తిన వంచనలు
రాహువు పట్టిందా ! జాతికి రక్తం చచ్చిందా !
ఆమె : రాహువు పట్టిందా ! జాతికి రక్తం చచ్చిందా !
అతడు : ఇప్పటికైనా ఈదేశం-తన తప్పు తెలుసుకోవాలి
కాకుంటే ఈ దేశాన్నే-కణకణమండే నిప్పులతో
కల్తీలేని నిప్పులతో-కడిగేస్తుంది మాతరం
అందరు : వందేమాతరం-వందేమాతరం-వందేమాతరం.
శ్లోకం : "యదాయదాహి ధర్మస్య
గ్లానిర్భవతి భారత !
అభ్యుత్థానమధర్మస్య
తదాత్మానం సృజామ్యహం".

---

పల్లవి : అంగట్లో అన్నీ వున్నాయ్

అతడు : అల్లుడి నోట్లో శనివుంది
వాట్ టుడూ ?
క్యాకరూఁ ?
ఏం చేద్దాం ?

చరణం : బెజవాడ ప్రక్కన్నే కృష్ణవుంది
నిండా నీరువుంది
బాగా పారుతుంది
పట్టణంలో నీళ్లపంపులెన్నోవున్నా
పట్టుకుందామంటే-బండిసున్న
నీళ్ళునిండు సున్న !
నోళ్ళు ఎండునన్నా ! ||అంగట్లో||

చరణం : ఏడుకొండలవాడా ! వెంకటరమణా
గోవిందా ! గోవిందా !
తిరుపతి వెంకన్నదయవుంది
పైగా డబ్బూవుంది
అయితే మనకేముంది ?
పూటకొక్క కాలేజివుడుతుంది
చదువులే చెప్పేస్తుంది
డిగ్రీ లిచ్చేస్తుంది !
ఆడిగ్రీలు మోసుకుని ఢిల్లీదాకావెళ్ళి

ఉద్యోగాలిమ్మంటే యేమవుతుంది ?

ఏమవుతుంది ?

కాలు అరుగుతుంది

చొక్కా చిరుగుతుంది

ఆకలి పెరుగుతుంది

ఆయాసం మిగులుతుంది

అప్పటికీ నువు అక్కడవుంటే

చిప్పచేతికేవస్తుంది ॥అంగట్లో॥

పల్లవి : తాగితే తప్పేముంది ? తాగితే ఒకనాడు తప్పు
తాగకుంటే లేనేలేదు మెప్పు That's Why ॥తాగితే॥

చరణం : గొప్పగొప్ప వాళ్లంతా-గుప్‌చుప్పుగ చేసేది
ఇష్ ! సైలెన్సు !
కొండకిందనేకాదు-కొండమీద జరిగేది !
గోయిందా-గోయింద
షాదీ జరిగినా-శ్రాద్ధం పెట్టినా
పార్టీపేరుతో ప్రతిచోట జరిగేది
ఇది లేందెక్కడ బ్రదర్ ! Tell Me That's Why ॥తాగితే॥

చరణం : బల్లకింద చెయిజాపితే
తప్పుకాదు-Its Habit
చీకటి బాజారులు నడిపితే
తప్పుకాదు There is Permit
దేశాన్నే అమ్ముకుంటె
తప్పుకాదు ! Patriot
దేవుడి మాన్యాలే భోంచేస్తే
తప్పుకాదు ! Saint
Then After all a Little Bottle of Wine ॥తాగితే॥

చరణం : తాగానని ముక్కు-మూసుకుంటావు ఓ మావా !
నేనేదో తప్పుచేసినట్టు తప్పుకుంటావు Insult !
ఎన్ని జుట్లు పట్టందే-ఎన్ని ప్లేట్లు మార్చందే-You-You

ఇంతవాడి వయ్యావు-రావుబహదూర్ ! నీ
అంతు తెలుసుమావా ! నా ముందు బలాదూర్ ||తాగితే||

చరణం : కోరికోరి నన్ను కట్టుకున్నావు పెళ్ళామా ! పెళ్ళామా !
కొంగున ముడివెయ్యాలనుకున్నావు పెళ్ళామా ! పెళ్ళామా !
నువ్వేమనుకున్నా-నీ బాబే ఏమన్నా
మూడు ముళ్ళు వేసిన నీ మొగుణ్ణి ! మొనగాణ్ణి !
ఇక నీ రిమ్మ తిరుగుదాక-నిన్ను వదల్నె వదల్ను
My Dear ||తాగితే||

పల్లవి : ఏయ్ మనిషీ ! ఏహేయ్‌మనిషీ !
ఏయ్ మనిషీ ! ఏహే మనిషీ
మరిచిపోనువు-ఒక మనిషివనీ
మరచిపోనువు ఒకమనిషివనీ-
అను-అను-అనుక్షణం
హరేరామ హరేక్రిష్ణ
హరేరామ హరేక్రిష్ణ-హరే

చరణం : గుళ్ళోపెట్టి దేవునికే-నామమేశావ్
పార్టీలుకట్టి నమ్మినోళ్ల-కొంపదీశావ్
గద్దెలెక్కి లంచాలే తెగగుంజావ్-బుద్ధి
గడ్డితిని దేశాన్నే దిగమింగావ్
జానెడంత పొట్టకొరకు-చచ్చేటంత పెనుగులాట
తొక్కులాట తోపులాట కుమ్ములాట గుద్దులాట
ఆడేగుండె ఆగిందంటే-ఆఖరికీ ఆరడుగులేబేటా
హరేరామ హరేకృష్ణ-హరేరామ హరేకృష్ణ

చరణం : అయ్యేమో ఆఫీసు ఫైళ్లపాలు
అమ్మేమో లేడీసుక్లబ్బుపాలు
ఉన్నకాస్త ఆస్తేమో-అప్పుపాలు
కన్నబిడ్డలేమో-బజారుపాలు
అమ్మలేదు అయ్యలేదు-పిల్లలేదు పీచులేదు
కొంపలేదు గోడులేదు-నీ దన్నది ఏదీలేదు
ఇహములేదు-పరమూలేదు

ఎవరికివారే యమునాతీరే-
ఏయ్ మనిషీ ! ఏహేయ్‌మనిషీ !
అను అనూ అనుక్షణం హరేరామ హరేక్రిష్ణ
హరేరామ హరేక్రిష్ణ

చరణం : సంపాదనచాలక ఒక ఏడుపు
పన్నులూ కట్టలేక ఒక ఏడుపూ
ఖర్చులూ తగ్గించలేక ఒక ఏడుపు
వెరసి నీ బ్రతుకంతా ఒకే ఏడుపూ-
జ్ఞానపత్రిదమ్ముకొట్టి-గుండెనిండ గుక్కపట్టి
నేలవిడిచి పైకిపైకి-తేలితేలిపోతుంటే
ఇంద్రలోక-చంద్రలోకం-
కంటిముందె కనపడుతాయ్‌భాయీ
ఏయ్ మనిషీ ! ఏహేమనిషీ !

పల్లవి :

ఆమె 1 : మరదలా! మరదలా! తమ్ముని పెళ్ళామా!
ఏమమ్మా! వైనమేమమ్మా!

ఆమె : వదినమ్మ! వదినమ్మ! అన్నయ్య పెళ్ళామా!
ఏమమ్మా! వైనమేమమ్మా!

చరణం :

ఆమె : చక్కనీ తిలకమ్ము
ముక్కున జారింది ఏమమ్మా! అది ఏమమ్మా!

ఆమె 2 : వల్లమాలిన చెమట
గల్లంతుచేసింది లేవమ్మా! ఇంతేలేవమ్మా!

చరణం :

ఆమె 1 : చల్లనివేళలో
చిరుచెమటలేమిటో! బుల్లెమ్మా! గడుసుబుల్లెమ్మా!

ఆమె 2 : తీసున్న కిటికీలు
మూసేస్తే జరిగింది లేవమ్మా! నన్ను వొదులమ్మా!

చరణం :

ఆమె 1 : పాలబుగ్గలమీద
వాడిపోనిగంటు లేమమ్మా! వైనమేమమ్మా!

ఆమె 2 : పెంపుడు చిలకొచ్చి
చెంపలు కొరికింది లేవమ్మా! అంతెనోయమ్మా!

చరణం :

ఆమె 1 : జామురాతిరికాదు
జడపూలు వాడెను ఏమమ్మా ! మర్మ మేమమ్మా !

ఆమె 2 : ప్రక్క ఒత్తిడికవి
సొక్కిపోయినవేమో లేవమ్మా ! చాలుపోవమ్మా !

చరణం :

ఆమె 1 : చీటికిమాటికి
పైటజారెనేమొ మరదలా ! బుల్లిమరదలా !

ఆమె 2 : పటుచీర ఒక
పట్టాన నిలవదు వదినమ్మా ! గడుసు వదినమ్మా !

చరణం :

ఆమె 1 : ఉన్నపాటున రైక
ముడివీడిపోయింది
ఏమమ్మా ! వైనమేమమ్మా !

ఆమె 2 : ఎదలోని పొంగుతో
సడలిపోయిందేమో లేవమ్మా ! చాలుచాలమ్మా !

చరణం :

ఆమె : 1 గదిలోని దీపమ్ము
వాదిగాదిగి వెలిగింది ఏమమ్మా ! వింతయేమమ్మా !

ఆమె : 2 మదిలోని నారాజు
గదిలోనె ఉన్నాడు పోవమ్మా ! చాలుపోవమ్మా !

చరణం :

ఆమె : 1 తెలిసింది లోగుట్టు
చాలించు నీ బెట్టు మరదలా ! బుల్లిమరదలా !

ఆమె : 2 నీకు తెలియనిగుట్టు
నాకెక్కడిది ఒట్టు ! వదినమ్మా ! యింక వొద్దులమ్మా !
వదినమ్మా ! ఇంక వొద్దులమ్మా !

ఆమె 1 : గడుసుబుల్లెమ్మా ! చాలువెళ్ళమ్మా !
గడుసుబుల్లెమ్మ ! చాలువెళ్ళమ్మా !

# 188

పల్లవి : చిన్నారి కృష్ణయ్యరారా! నా
కన్నులలో పున్నమి నీవేరా!

చరణం : రతనాలమేడలో నివసించినా
రమణీయ తల్పాన శయనించినా
ఆరనివేదనతో-ఆవిరియౌ నామదిలో
ఆశల తేనెజల్లు కురిసేవురా !
బ్రతుకు నిలిపేవురా ||చిన్నారి||

చరణం : కన్నతల్లి మనసు దీపకళికరా! తాను
కరిగిపోయి పాలవెలుగు లొలుకురా !
ఆవేదన తనది-ఆనందమునాది
ఈ వింత అనుబంధం - ఎవరికి తెలుపనురా !
ఏమని తెలుపనురా ! ||చిన్నారి

నిర్దోషి

వల్లవి : గున్నమామిడీ కొమ్మమీద
గూళ్ళురెండున్నాయి.
ఒక గూటిలోన రామచిలకుంది
ఒక గూటిలోన కోయిలుంది.

చరణం : చిలకేమో పచ్చని దీ
కోయిలేమొ నల్లనిదీ
ఐనా ఒక మనసేదో
ఆ రెంటిని కలిపింది
పొద్దున చిలకను చూడందే - ముద్దు
ముద్దుగ ముచ్చట లాడందె
చిగురులు ముట్టదు చిన్నారి కోయిల
చిలక ఊగదు కొమ్మ ఊయెల ॥గున్న॥

చరణం : ఒక పలుకే పలుకుతాయి
ఒక జటుగ తిరుగుతాయి
ఎండైనా వానైనా
ఏకంగా ఎగురుతాయి.
రంగూ రూపూ వేరైనా
జాతీ రీతీ ఏదైనా
చిలకా కోయిల చేసిన చెలిమి
ముందుతరాలకు తరగని కలిమి ॥గున్న॥

# 190

పల్లవి : కాకమ్మా చిలకమ్మా - కథ లే మాకొద్దు

చరణం : మా గాంధీచెప్పింది - మాకెంతో ముద్దు

అతడు : నేతాజీ ఏమన్నాడు ?

అందరు : జైహింద్ ! జైహింద్ ! అన్నాడు.

అతడు : నెహ్రూజీ ఏమన్నాడు ?
శాంతీ ! శాంతీ ! అన్నాడు.
లాల్‌బహాద్దూర్ - వీరబహద్దూర్ ఏమని అన్నాడు.
జై జవాన్ ! జై కిసాన్ ! అన్నాడు పదమన్నాడు.

చరణం : పిల్లలకే ఇక రాజ్యంవస్తే
కల్లలు ఎల్లలు తుడిచేస్తాం
అల్లరిమూకల ఆటలు కట్టి
తెల్లని పావుర మెగరేస్తాం
రాజును రైతును ఏకం చేసి
రంగంమీదికి రప్పిస్తాం.
సింహానికీ, జింక పిల్లకూ
స్నేహం కలిపి మెప్పిస్తాం ॥కాకమ్మ॥

చరణం : పసిపాపల మనసులు పువ్వులు - అవి
పరమాత్ముని చిరునవ్వులు
ఆ పాపలు తిరిగే లోగిళ్ళు
పచ్చని సిరులే వెదజల్లు ॥కాకమ్మ॥

ధర్మపత్ని

## 191

పల్లవి : ఎంతెంత దూరం ! ఇంకెంతదూరం !
కథలు చెప్పుతూ పోతూవుంటే-కాసింతదూరం

చరణం : రివ్వునఎగిరే సువ్వలగుంపులు !
ఎక్కడికెళ్ళుతున్నాయి ? అవి
ఎక్కడికెళుతున్నాయి.
కూతకురాని పిల్లలకోసం
మేతకువెళుతున్నాయి.
మేతకువెళుతున్నాయి. ॥ఎంతెంత॥

చరణం : చల్లగసాగే ! తెల్లని మబ్బులు
ఎక్కడి కెళుతున్నాయి? అవి
ఎక్కడికెళుతున్నాయి ?
నోళ్ళువిచ్చిన బీళ్ళకోసం
నీళ్ళకువెళుతున్నాయి !
నీళ్ళకు వెళుతున్నాయి. ॥ఎంతెంత॥

చరణం : చక్కని బావా నువ్వూనేనూ !
ఎక్కడికెళుతున్నాము !
మనమెక్కడికెళుతున్నాము ?
పామునుపట్టి - బుట్టలో పెట్టి
పండిన పాపం - బద్దలు కొట్టి
మానాన్నను విడిపించాలనీ
ఇద్దరము వెళుతున్నాము
మనమిద్దరము వెడుతున్నాము ॥ఎంతెంత॥

---

మానాన్న నిర్దోషి

పల్లవి : జో లాలీ !
జో లాలీ !
లాలీ నాచిట్టితల్లి !
లాలీ ననుగన్న తల్లీ
లాలీ బంగారు తల్లీ !
లాలీ నాకల్పవల్లీ

చరణం : చిరునవ్వుకిరణాలు - చిందించు మోము
కన్నీరు మున్నీరుగా చూడలేను.
నినుగన్న నీతల్లి కనుమూసె గాని
నినువీడి క్షణమైన - నేనుండగలనా ||జోలాలీ||

చరణం : రతనాల భవనాల నిన్నుంచలేను
ముత్యాల వుయ్యాల లూగించలేను
కనుపాపలా నిన్ను- కాపాడుకోనా
నిరుపేదఒడిలోన నినుదాచుకోనా ||జోలాలీ||

## 193

పల్లవి : అమ్మమనసెంత కమ్మనిదో
ఆమెకలలెంత విలువైనవో
కన్నవారికితెలుసూ
ఈ చిన్నినాన్నకు తెలుసూ

చరణం : ఆకాశంలో పుట్టినచంద్రుడు
అవనినే వెలిగించడా!
దేవకి కడుపునపుట్టినకృష్ణుడు
యశోదనే అలరించడా!
ఏకడుపున పుట్టినా
ఏఒడిలో పెరిగినా
తనయుడు పేరొందినచాలు
తల్లికదే పదివేలు ||అమ్మ||

చరణం : పున్నమి జాబిలిచూడగానే
పొంగిపోవును సాగరం
లేగదూడను చూడగానే
ఆగదు గోమాత హృదయం
ప్రతితల్లికి అదిసహజం
ఆ మమతే అతిమధురం
ఐనా! అదిహద్దుదాటితే
లేదెవరికి ఆనందం ||అమ్మ||

చరణం . ఏ పూల పొదలచాటున
ఎన్ని ముళ్ళు దాగున్నా
ఏ చూపు తెరలమాటున
ఏ నాగులు బుసకొడుతున్నా
చిన్నిబాబు మోముచూసి
అన్నీ మరిచిపోవాలి
ఎంతచేదు బాధలైనా
గొంతుకలో దాచాలి ॥అమ్మ॥

## 194

పల్లవి . ఆదివారం అమావాస్య - అందరికిమంచిది
ఇదిమానాన్న పుట్టినరోజు - మరీమరీమంచిది
మాకెంతోమంచిది - మకెంతోమంచిది

చరణం : అందరినీమెప్పిస్తాడు మానాన్న
ఎవ్వరినీ నొప్పించలేదుమానాన్న
నవ్వుతాడు – నవ్విస్తాడు
ఏడుపొచ్చినానవ్వేస్తాడు - మానాన్న - పిచ్చినాన్న ||అది||

చరణం : మేమునవ్వితే మానాన్నమనసు నిండుతుంది
మేముతింటే - మానాన్నకడుపు నిండుతుంది
మానాన్నకు - ఆస్తిఅంతామేమేకదా!
ఈలోకంలో మా ఆస్తిఅంతానాన్నేకదా! ||అది||

చరణం : మానాన్న తెల్లచొక్కా ఇకముందు మాయదు
మానాన్న భోళామనసు - ఏనాడుచెదరదు.
నాలుగుచేతుల సంపాదించీ - నాన్నకు తినిపిస్తాము
తల్లులమైజోలపాడుతాం - పిల్లలమైఆటలాడుతాం
తల్లులమైజోలపాడుతాం - పిల్లలమైఆటలాడుతాం ||అది||

## 195

పల్లవి . నవ్వుతు నువ్వుండాలి - మీ
నాన్న మది నిండాలి
నిన్నుగన్న తల్లి ఆశలేపండగా

చరణం . నెలవంక దీపం - నింగికేవెలుగు
కనుపాపదీపం - కంటికేవెలుగు
ఆకలిలోనైనా - చీకటిలోనైనా
పాపాయిచిరునవ్వు - ప్రతియింటవెలుగు ||నవ్వు||

చరణం : మనసైనదేదీ - మమకారమొకటె.
కొనలేనిదేదీ - కారుణ్యమొకటె
ఎవ్వరు ఏమన్నా - ఏవిధి ఎదురైనా
మనిషికిమిగిలేది - అనుబంధమొకటే ||నవ్వు||

చరణం : ఈనాడునీకు - ఐదేళ్ళుపాపా!
ఎదగాలినువ్వు - నూరేళ్ళదాకా.
వేడుకలోనైనా - వేదనలోనైనా
ఒకలాగేసాగాలి - శిఖరాలదాకా ||నవ్వు||

---

బంగారు మనసులు

# 196

పల్లవి : ఈనాడేబాబూ ! నీ పుట్టినరోజూ
ఈ యింటికే కొత్త వెలుగు వచ్చినరోజూ

చరణం : చిన్నిబాబు ఎదిగితే - కన్నవారికానందం
నెలవంక పెరిగితే - నింగికే ఒక అందం
చుక్కలు వేయెందుకు - ఒక్క చంద్రుడేచాలు
తనవంశం వెలిగించే - తనయుడొకడే పదివేలు ||ఈనాడే||

చరణం : కన్నవారి కలలు తెలుసుకోవాలి-ఆ
కలలు కంటనీరు పెడితే తుడవాలి
తనకుతాను సుఖపడితే - తప్పుగాకున్నా
తనవారిని సుఖపెడితే - ధన్యత ఓనాన్నా ||ఈనాడే-

చరణం : తండ్రిమాటకై కానకు - తరలిపోయె రాఘవుడు
అందుకే ఆ మానవుడు - ఐనాడు దేవుడు
తల్లిచెరను విడిపించగ - తలపడె ఆ గరుడుడు
అందుకె ఆ పక్షీంద్రుడు - అంతటిమహానీయుడు.
ఓబాబూ నువ్వూ ఆ బాట నడవాలి
భువిలోన నీపేరు - ధ్రువతారగ వెలగాలి ||ఈనాడే||

---

తాత-మనవడు

పల్లవి : బాలలారా ! రండి!
భావిపౌరులారా! రండి!
తరతరాల తెలుగునేల
తీరూతెన్నూ చూడండి

చరణం : కాకతీయులకు త్రిపదునులో
కాకలు తీరిన నగరం - మన
ఏకశిలానగరం
అదే వరంగల్ పట్టణం - అ
వరంగల్లుకే వన్నె తెచ్చినది
వేయిస్తంభాల మందిరం -అది
నేటికి ఎంతోసుందరం ||బాలలారా||

చరణం : బీళ్ళనే పసిడిచేలుగా మార్చు
చల్లని నదీమతల్లి - మన
పాలిటికల్పవల్లి
అదే కృష్ణవేణి ! అ
కృష్ణవేణియే గుండె పెంచుకొని
నిలిచెను సాగరమై
నాగార్జునసాగరమై

చరణం : బౌద్ధమతానికి పాదులువేసిన
ఉన్నతవిద్యానిలయం - నవ
శిల్పకళానిలయం
అదే అదే అమరావతి ! అ
అమరావతిలో శిలలైనా
వినిపించును సరిగమలు !
పులకించును హృదయాలు ! ||బాలలారా||

సిసింద్రీ చిట్టిబాబు

పల్లవి :

ఆమె : ఎన్ని జన్మల -ఎన్నినోముల
పుణ్యమో ఈనాడు కంటిని
జగములూపే ముగ్గురు మూర్తులే
చంటిపాపలుకాగా - మా
యింటవుూయల లూగ

బృందం : లాలీ-లాలీ
లాలీ-లాలీ

చరణం :

ఆమె : నొసటి వ్రాతలు వ్రాసివ్రాసీ
విసిగినావో నిదురపో

బృందం : బ్రహ్మయ్య తాతా నిదురపో

ఆమె : అసురకోటుల తునిమితునిమీ
అలసినావో నిదురపో

బృందం : నారయ్య నాన్నా ! నిదురపో

ఆమె : ప్రళయతాండవమాడి ఆడీ
సొలసినావో నిదురపో

బృందం : శివయ్యబాబూ ! నిదురపో ॥ఎన్ని జన్మల॥

చరణం :

ఆమె : లలితకళలకు నిలయమైన
వాణియే నాకోడలాయె

బృందం : లాలీ జయలాలీ

ఆమె : లాలితముగా సిరులనొసగే
లక్ష్మియేనాకోడలాయె.

బృందం : లాలీ శుభలాలీ

ఆమె : పతినిగొలిచిన భాగ్యమేమో
పార్వతియె నాకోడలాయె

బృందం : లాలీ ప్రియలాలీ ||ఎన్ని జన్మల||

పల్లవి ;

ఆమె : అ—అమ్మ—ఆ—ఆవు
అమ్మ వంటిదే ఆవు
అదితెలుసుకో నీవు

చరణం : ఇ—ఇల్లు—ఈ—ఈశ్వరుడు
ఇంటిని ఇలనూ కాచేదెవడు ?
ఈశ్వరుడూ పరమేశ్వరుడు !
అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఌ ౡ
ఎ ఏ ఐ ఒ ఓ ఔ అం అః.
క ఖ గ ఘ ఙ - చ ఛ జ ఝ ఞ
ట ఠ డ ఢ ణ - త థ ద ధ న
ప ఫ బ భ మ - య ర ల వ
శ ష స హ ళ క్ష
అ - మొదలుకొని - క్ష వరకు మన
అక్షరమాల యాభైయారు.
అక్షరమాల నేర్చుకొని
ఆ పై బ్రతుకులు దిద్దుకొని
చక్కని పౌరులు కావాలి మన
జాతికి పేరు తేవాలి ॥అ-అమ్మ॥

చరణం : అందరిదీ ఒకే కులం
అందరమూ మానవులం
కండలు పెంచితె సరిపోదు
కావాలయ్యా బుద్ధిబలం

చరణం : మనభాషలు వేరేఐనా - మన
మతాలు వేరేఐనా
పాలూ పైరూ ఒకటే - భూ
మాత అందరికొకటే

ఆమె : పేదాగొప్పా - భేదాలు
పెళ్ళగించుకొనిపోవాలి
గిరిజనుడే పురజనుడై
ధరాచక్రమును తిప్పాలి ! ఈ
ధరాచక్రమును తిప్పాలి. ||అ-అమ్మ||

## 200

పల్లవి : పండితనెహ్రూ పుట్టినరోజు
పాపలందరికి పుట్టినరోజు
మమతా సమతా పుట్టినరోజు
మంచికి కోవెల కట్టినరోజు

చరణం : ముత్యంలాంటి మోతీలాలుకు
రత్నంలా జన్మించాడు
జాతిరత్నమై వెలిగి యింకొక
జాతిరత్నమును కన్నాడు!
అతడే జవహర్‌లాలు!
అతనికి మన జేజేలు ||పండిత||

చరణం : తలపై తెల్లని టోపీ
ఎదపై ఎర్రగులాబీ।
పెదవులపై చిరునవ్వు
చేతిలో పావురం - మన
జాతికి అతడే గోపురం ||పండిత||

చరణం : మహాత్మగాంధీ అడుగుజాడలో
స్వరాజ్య సమరంనడిపాడు।
రణదాహంతో రగిలే జగతిని
శాంతిసుధలు కురిపించాడు
కన్నుమూసినా జవహర్‌లాల్ మీ
కంటిపాపగా ఉన్నాడు
ఇంటింట జ్యోతిగా వున్నాడు!
చాచానెహ్రూ అమర్‌రహే! ||పండిత||

---

# 201

పల్లవి : పదహారు కళలతో పెరగాలిరా ! నువ్వు
పది మందిలో పేరు పొందాలిరా !
చిన్నారి నాన్నా ! వెన్నెలకూనా !

చరణం : తాతయ్యమూపుపై-స్వారీ చేసేవు
నాయనమ్మ మూతిపై-వెన్న రాసేవు !
నీకేమి లోటురా ఈ యింటిలో
నిను దాచుకుంటాను నా కంటిలో ||పద||

చరణం : నా ప్రాణమేరా ఆ అమ్మ
నీ ప్రాణమేరా ఈ అమ్మ
ఆ అమ్మ దేవతగ-మారిందిరా
ఈ అమ్మయే నీకు మిగిలిందిరా ||పద||

## 202

పల్లవి : నవ్వరానువ్వైనా !
నవ్వరా బాబూ ! ఆ
నవ్వేనిను పెంచు-పాల
బువ్వరా బాబూ

చరణం . మొలకగా పుట్టావు
ఒకతల్లి కడుపులో
మొగ్గగా పెరిగేవు
ఒకకన్నె చేతిలో
ఎందుకుపుట్టావో
ఎందుకు పెరిగేవో
బదులైనా చెప్పలేని
పరమాత్మని తలచుకొని ||నవ్వరా||

చరణం : మీయమ్మ ఏదని
ఏవరైనా అడిగితే
కన్నీరునింపక
నన్నే చూపించరా
కన్నంతమాత్రాన
అమ్మలుకారురా
కమ్మని మనసున్న
ప్రతి ఆడది అమ్మేరా ||నవ్వరా||

---

అమ్మాయిగారూ-అబ్బాయిగారు

పల్లవి : ఇది విలాసయాత్ర!
ఇది వినోదయాత్ర!
పిల్లలతో పాపలతో
చల్లగసాగే విహారయాత్ర!

చరణం :

అతడు : చలికాలం సూరీడు చల్లన

ఆమె : కంకాలం అనురాగం వెచ్చన

అతడు : నా చెలి జాబిలి ఎప్పుడూ చల్లనిదే

ఆమె : ఆ చలవా ఆవెలుగూ అంతా నా సూర్యునిదే

పిల్లలు : అమ్మమనసు 'ఐసు'కంటే చల్లన
నాన్నకోపం-'ఫైరు'కంటె వెచ్చన

చరణం :

అతడు : మల్లె తీగకు పూచేవి-మల్లెపూలే
మామిడిచెట్టుకు కాచేవి మామిడికాయలే

ఆమె : ఈ పాపలే మన చెలిమికి ప్రతిరూపాలు
రేపటి ఆశల వెలిగించే-మణిదీపాలు

పిల్లలు : అమ్మమాటే అంటాం
నాన్న మాటే వింటాం
అలా నడుచుకుంటాం
పేరు తెచ్చుకుంటాం

దీర్ఘసుమంగళి

## 204

పల్లవి : పాపా! కన్నెపాప ? పదహారేళ్ళ పసిపాపా !
నిదురపో నీవూ–ఈ బొమ్మలాగా
నేను జోల పాడేను–అమ్మలాగా

చరణం : పువ్వులా వికసించెను–నీ వయసు !
కాని మొగ్గలాంటిదేనమ్మా–నీ మనసు !
తమ్మెలు ఎవరో ! తుమ్మెదలెవరో !
తెలియని నీ పసితనం–ఆ
దేవునికే తెలుసు ॥పాపా॥

చరణం : విరబూసే నీ కనులకు–
వెన్నెలనౌతానమ్మా చెల్లీ !
అరమూసే ఆ కనులకు–ని
ద్దురనౌతానమ్మా !
లాలీ–లాలీ–లాలీ
అక్కయ్య దీవనే చెల్లికిరక్ష !
ఆపైన మనకుంది శ్రీరామరక్ష !

పల్లవి : ఓనాన్నా ! నీ మనసేవెన్నా
అమృతంకన్నా అది ఎంతోమిన్న

చరణం : ఓనాన్నా ! ఓనాన్నా !
ముళ్లబాటలో నీవు నడిచావు
పూలతోటలో మమ్ము నడిపావు
ఏ పూట తిన్నావో-ఎన్ని పస్తులున్నావో
పరమాన్నం మాకు దాచివుంచావు ||ఓనాన్నా||

చరణం : ఉన్ననాడు ఏమి దాచుకున్నావు
లేనినాడు చేయిసాచనన్నావు
నీ రాచగుణమే మా మూలధనము
నీవే మాపాలి దైవము ||ఓనాన్నా||

చరణం : పుట్టింది అమ్మ కడుపులోనైనా-పాలు
పట్టింది నీ చేతిలోనా
ఊగింది ఊయ్యాలలోనైనా-నేను
దాగింది నీ చల్లని ఒడిలోన
చల్లనిఒడిలోన ||ఓనాన్నా||

పల్లవి : మాయదారి సిన్నోడు - నా
మనసే లాగేసిండు - నా
మనసేలాగేసిండు
లగ్గమెప్పుడురా మావా అంటె
మాగమాసం యెల్లేదాకా
మంచిరోజు లేదన్నాడే
ఆగేదెట్టాగా ? అందాకా ఏగేదెట్టాగా ?
రత్తమ్మ! సెప్పవే అత్తమ్మ సెప్పవే !
కావమ్మ సెప్పవె!- రావమ్మ సెప్పవే!
ఆగేదెట్టాగా - అందాకా ఏగేదెట్టాగా

చరణం : సింతసెట్టెక్కి -సిగురులు కోస్తుంటే
సిట్టి సిట్టి గాజూలూ - తాలం యేస్తుంటే
సిగురుల్లో - సిగురుల్లో
సిగురుల్లో మాటేసి కన్నుగీటిండే
సిత్రంగా పానాలు తోడేసిండే
లగ్గమెప్పుడురా మావా అంటే
సంకురాతిరి పొయ్యేదాకా
మంచిగడియేలేదన్నాడే
ఆగేదెట్టాగా ? అందాకా
ఏగేదెటాగా ?
యెల్లమ్మ సెప్పవే! -మల్లమ్మ సెప్పవే!
పుల్లమ్మ సెప్పవే!-బుల్లెమ్మ సెప్పవే! ||ఆగే||

చరణం : ఊరి సెరువులో - నేనీదులాడుతుంటే
నీటినురగల్లో- తేలి తేలి పోతుంటే
బుడుంగున - బుడుంగున
బుడుంగున మీదికి తేలిండే - నా
తడికొంగు పట్టుకొనిలాగిండే
ఎప్పుడురా మాఁవా అండే
శివరాతిరి యెల్లేదాకా
సుబలగ్గం లేదన్నాడే
ఆగేదెట్టాగా ? అందాకా
ఏగేదెటాగా ?
పున్నమ్మ సెప్పవే ! గున్నమ్మ సెప్పవే!
కన్నమ్మ సెప్పవే! సిన్నమ్మ సెప్పవే! ॥ఆగే॥

చరణం ; కందిసేలల్లో కాపలి కాసేసి
సందెకాడ ఒంటరిగా -డొంకదారి నొస్తుండే
గబుక్కున - గబుక్కున
గబుక్కున - కళ్ళు రెండు మూసిండే
రివ్వున వాటేసి నవ్వేసిండే
ఏందిరా మాఁవా అండే
కోడికూసి కూయంగానే
తాళికడతానన్నాడే
ఆగేదెటాగా యీరాతిరి
యేగేదెట్టాగా ?
అమ్మమ్మ సెప్పవే ! అయ్యమ్మ సెప్పవే!
పెద్దమ్మ సెప్పవే! పిన్నమ్మ సెప్పవే! ॥మాయ॥

## 207

పల్లవి :

అతడు : సంతకెల్లి వచ్చేతలికి
ఇంతమారిపోతివి మల్లా
ఏం పిల్లా ! కత
యేందే పిల్లా

ఆమె : ఇంతలోనే - యిట్లోనే
ఎంతపని జరిగిందో !
ఓ మామా ! చెప్పేదెట్టా మామా !

అతడు : ఎట్టెట్టా ! ఏందా కత చెప్పు చెప్పు
ఏం జరిగిందో చెప్పవే ?

చరణం :

ఆమె : ఒకరిమీద కన్నేస్తిని
ఒకరిమీద చెయ్యేస్తిని

అతడు : ఎవరిమీద కన్నేస్తివే?
ఎవరిమీద చెయ్యేస్తివే ?

ఆమె : అద్దంమీద కన్నేస్తిరా!
కొప్పుమీద చెయ్యేస్తిరా!

చరణం :

ఆమె : ఒకరికీ చెంపలానిస్తిని !
ఒకరికీ పెదవులందిస్తిని !

అతడు : ఎవరికీ చెంపలానిస్తివే ?
ఎవరికీ పెదవులందిస్తివే ?

ఆమె : దిండుకూ చెంపలానిస్తిరా!
పండుకూ పెదవులందిస్తిరా !

చరణం :

ఆమె : ఒకరికీ ఒళ్ళిస్తినీ !
ఒకరికీ వయస్తినీ !

అతడు : ఎవరికీ ఒళ్ళిస్తివే ?
ఎవరికీ వయసిస్తివే ?

ఆమె : చల్లని నీటికీ ఒళ్ళిస్తిరా !
సన్నని పైటకు వయసిస్తిరా !

అతడు : అన్నిటికి అన్ని స్తివీ ! మరి
నాకేమి మిగిలిస్తివీ ?

ఆమె : అన్నిటినీ కలబోసి
వన్నె వలపూ జతచేసీ
నన్నే నీకిచ్చుకున్నానురా ! ఒక
నాడైన నిన్నిడిచి వుండలేనురా ,

బంగారక్క

# 208

పల్లవి : బతుకమ్మ బతుకమ్మ ఉయ్యాలో
బంగారు గౌరమ్మ ఉయ్యాలో

అమ్మాయిలు : పసుపుకుంకుమలిచ్చి ఉయ్యాలో
పాలించవేతల్లి ఉయ్యాలో
నా నోము పండింది-ఉయ్యాలో
నీ నోము పండిందా ? ఉయ్యాలో
మా వారు వచ్చిరి-ఉయ్యాలో
మీవారు వచ్చిరా ? ఉయ్యాలో ||బతుకమ్మ||

చరణం :

ఆమె : ఊరంత ఈరోజు బతుకమ్మ పండుగ
నా బావవస్తే-వస్తే
నా బావ వస్తే
నా బతుకంత పండుగ

ఒక అమ్మాయి: బావా నీ బావ !
వస్తాడు ఆగవేభామా !
ఔనా ! అతడౌనా !
అందాల చందమామా !

ఆమె : బావ-నా బావ
వస్తాడు ఆగవేభామా !
అవునే-అతడౌనే
అందాల చందమామా

చరణం :

ఆమె : మా బావ నవ్వితే
మరుమల్లెలెందుకే !

మా బావ తాకితే
సిరివెన్నెలలెందుకే
నింగిని దిగివస్తాడే
ముంగిట అగుపిస్తాడే
ఒక్కసారి చూశారా!
సొక్కిసోలిపోతారే
బావా ! నా బావా !
వస్తాడు ఆగవే భామా
ఔనే అతడౌనే
అందాలచందమామా !

చరణం :

ఒకఅమ్మాయి: ముత్యాల పందిరి
వేయించమందువా !
మేఘాలపల్లకి
తెప్పించమందువా !
ఒంటరిగా వస్తాడే
జంటగగొనిపోతాడే
ఊరిని మరిపిస్తాడే
నీ వారిని మరిపిస్తాడే

ఆమె : బావా ! నా బావా !
వస్తాడు-ఆగవే భామా !
ఔనే ! అతడౌనే !
అందాల చందమామ !

సాకీ : మామిడితోపుల్లోనా-మాపటేల మాటేసి
చిక్కుడు పాదూకాడా-చీకటేల పట్టేసి
చెప్పలేని రుచులెన్నో-చిటికెలోన చూపించి

పల్లవి : మాయచేసి పోతివిరో నాగులూ ! నా
మాటమరచిపోతివిరో నాగులూ !
ఓలమ్మో ! ఓరినాయనో ! ఓలమ్మో ! ఓరినాయనో

చరణం : నిన్నే కావాలని ఎన్నుకొంటిని
నీ చుట్టూ నామనసే అల్లుకొంటిని
రేకెత్తే నా సొగసే-నీకు ముడుపుకడితిని
ఇన్ని చేసినదాన్ని-ఏ మెరుగని చిన్నదాన్ని ||మాయ||

చరణం : నట్టింట ఒంటరిగా-కాచుకొంటిని
నడిరాతిరి ఉసురుసురంటూ-వేచియుంటిని
ఆకు చప్పుడైనా నీ అడుగులే-అనుకొంటిని
నిన్నే నమ్మినదాన్ని-నీకే నచ్చినదాన్ని-
కాదుమరి- ||మాయ||

చరణం : తొలినాటి తొందరలు ఏ మాయెరా !
ఆ బులిపాలు మురిపాలు కరువాయెరా
నిద్దరపోతూవున్నా ఆ ముద్దులే గురుతాయెరా !
చిగురాకులాంటిదాన్ని-వగలేవిలేనిదాన్ని- ||మాయ||

పల్లవి :

అతను : గంపానెత్తిన పెట్టి-గట్టుమీద పోతుంటే
గుండెఝల్లుమన్నాదే రంగమ్మా ! హోయ్
గుబులు గుబులుగున్నాదే రంగమ్మా !

ఆమె : చేత కఱ్ఱపట్టుకుని
చెంతకు నువ్వొస్తుంటే
చెంగునిపకున్నాదే బావయ్యా :
సిగ్గు మొగ్గలేస్తుందే బావయ్యా :

చరణం :

అతను : తలుపుదాటుగా నువ్వు తొంగిచూస్తివి-నీ
చిలిపికళ్ళతో నన్ను లాగేస్తివి

ఆమె : అదునుచూచి నా చెయ్యి పట్టుకుంటివి
ఆనాటి నుంచి నా మదిలో - అల్లరిపెడుతుంటివీ

చరణం :

అతను : నీ కందిరీగనడుమేమో కదులుతున్నదీ
దాన్ని అందుకోను-నా మనసే వురుకుతువున్నది

ఆమె : నీ ఉంగరాల జుట్టేమో ఊగుతున్నది-దాన్ని
ఒక్కసారి నిమరాలని వుబలాటం వున్నదీ ॥గంపా॥

చరణం :

అతడు : పైరగాలి నా చెవిలో వూదుతున్నదీ-నీ
పడుచుదనం రుచి ఎంతో చూడమన్నది

ఆమె : లగ్గమాదేరోజు దగ్గెరున్నదీ-మనం
లగ్గమాదేరోజు దగ్గెరున్నదీ
అందాక ఈ తొందర ఎందుకులే అన్నది ॥గంపా॥

## 211

పల్లవి : ఆకూపచ్చని చేలు - అల్లోనేరెళ్ళో
ఆ పైన పైరగాలి - అల్లోనేరెళ్ళో
అందాలమాపల్లె - అల్లోనేరెళ్ళో
ఆనాటి రేపల్లె - అల్లోనేరెళ్ళో

చరణం : నీలిమబ్బుల్లోన కనిపించేవి
బాలకృష్ణుని మేని నిగనిగలే
అల్లరిగాలిలో వినిపించేవి
పిల్లనగ్రోవి సవ్వడులే
పాలపొదుగుల-ఆలమందలే
ఊరించే తీయని కోరికలే ॥ఆకూపచ్చని॥

చరణం : తీయని మామిళ్ళ తొలకరిపూతలు
తెలుగు కన్నియల తొలిసిగ్గులే
చిలిపిగపాడే కలికికోయిలలు
పలికేది నెరజాణ భావాలే -
ఏటి తరగలా - నీటి నురగలా
మెరిసేవి పరువాల - చిరునవ్వులే ॥ఆకూపచ్చని॥

## 212

పల్లవి : వచ్చింది వచ్చింది లచ్చిమి !
వనలచ్చిమి ! మహాలచ్చిమి
ధనలచ్చిమి మాలచ్చిమి
పద్దాని చిలకల్లే - పసినిమ్మపండల్లే
ముచ్చటైన వయ్యారం మూటగట్టితెచ్చింది.

చరణం : మెత్తగా ఓరచూపు నాటుతుంది- సుర
కత్తిలాగుండెల్లో దిగుతుంది
తీయగా వాలునవ్వు చిలుకుతుంది గుండె
గాయాన్ని మరీ మరీ కెలుకుతుంది
అరె ! అందమంటే దానిదే ! బతు
కెందుకురా ! అదిలేనిదే?

చరణం : లేనినడుము ఓయమ్మో ! కదులుతున్నది - అది
ఉన్నమనసునే కాస్తా కాజేస్తుంది.
ఘల్లూ ఘల్లూన అదినడుస్తుంది - దాని
కాళ్ళకింద పడుచుదనం పడిచస్తుంది
నా ప్రక్కనేవుంటే ఆ చెలి !
ఇంకెక్కడిదిరా ఆ కలి ! ॥వచ్చింది॥

చరణం : ఖాదర్ఖాయికి కోడిపలావు తెచ్చింది
సింహాద్రికి - చేపలపులుసు తెచ్చింది
యాదగిరికి -దూదుమలాయి తెచ్చింది.

ఒకడు : మరినీకో ?

అన్నిరుచులూకలిగివున్న
కన్నెవయసే తెచ్చింది - ముదు
కానుకగా ఇచ్చింది ॥వచ్చింది॥

---

మరపురానిమనిషి

పల్లవి :

వాడేవాడంటె వాడే ।
వన్నెల చెలికాడే । హాయ్ హాయ్ ।।
అన్నిట సరిజోడే ।

చరణం :

సొగసరి నారాజు చూడనే చూడడు
చూసెనా । చూడక చూసెనా ।
సూటిగ గుండెలో చూస్తాడే ।। ॥ వాడే ॥

చరణం :

నాజూకు నారాజు-నవ్వనే నవ్వడు
నవ్వేనా , నవ్వక నవ్వేనా।
పువ్వుల వానలు కురిపించుతాడేం !!

చరణం :

షోకైన నారాజు-తాకనే తాకడు
తాకెనా । తాకక తాకెనా ।।
అమ్మమ్మో । ఆపైన ఏమౌతుందో।। ॥ వాడే ॥

సాకీ :

కంచెకాడ మంచెకాడ-కందిచేను గుబురుకాడ
ఏటికాడ గున్నమావితోటకాడ-సందెకాడ
మాటువేశాను-పొంచిసూశాను-దారికాశాను

పల్లవి :-

నీకోసం
నీ షోకైన మగసిరికోసం

చరణం : సింత పూల రైక తొడిగి
సింహాచలం నేనుబోతే
గుంటనక్క గుర్రుమన్నది.
అపుడు నేనేం చేశాను ?
తళుక్కుమని ఒక మెరపు మెరవగా
దౌడుతీసి ఇటు వచ్చాను ||నీకోస||

చరణం :

రంగు రంగుల కోక కట్టి
ఒంగోలుకు నేను పోతే
పొట్లగిత్త ఎదురుపడ్డది.
గుబులు గుబులై నా మనసు చెడ్డది.
అపుడు నేనేంచేశాను ?
అమ్మమ్మను తలపోశాను
గిత్తను వంచే మొనగాడెవడని
తత్తరపడి యిటు వచ్చాను. ||నీకోసం||

చరణం !

వంకసిగలో పూలుపెట్టి
వరంగల్‌కూ నేనుపోతే
కోడెకాడే కన్నుగొట్టెనే
వాడావాడా నవ్వబట్టెనే.
అపుడు నేనేమయ్యాను ?
ఆవిరావిరై పోయ్యాను
ఈ దోరవయసు నన్ను బతకనివ్వదని
ఊరు విడిచి ఊరికి వచ్చాను ॥నీకోసం॥

# 215

పల్లవి : బలేమంచి రోజు
పసందైనరోజు
వసంతాలు పూచే నేటిరోజు ||బలే||

చరణం : గుండెలోని కోరికలన్నీ
గువ్వలుగా ఎగిసినరోజు
గువ్వలైన ఆకోరికలే
గూటిలోన చేరినరోజు
నింగిలోని అందాలన్నీ
ముంగిటిలోనే నిలచినరోజు ||బలే||

చరణం : చందమామ అందినరోజు
బృందావని నవ్వినరోజు
తొలివలపులు చిలికినరోజు
కులదైవం పలికినరోజు
కన్నతల్లి ఆశలన్నీ
సన్నజాజులై విరిసినరోజు ||బలే||

పల్లవి : ఆడవే! ఆడవే!
ఆడవే! జలకమ్ము లాడవే!
కలహంసలాగ-జలకన్యలాగ

చరణం : ఆదికవి నన్నయ్య అవతరించిన నేల
తెలుగుభారతి అందియలు పల్కె ఈనేల
ఆంధ్ర సంస్కృతికి తీయని క్షీరధారలై
జీవకళలొల్కు గోదావరి తరంగాల ॥ఆడవే॥

చరణం : నాగారునుని బోధనలు ఫలించినచోట
బౌద్ధమత వృక్షమ్ము పల్లవించినచోట
కృష్ణవేణీ తరంగిణి జాలిగుండెయే
సాగరమ్మై రూపు సవరించుకొనునీట ॥ఆడవే॥

చరణం : కత్తులును గంటములు కదను త్రొక్కినవిచట
అంగళ్ళ రతనాలు అమ్మినారట యిచట
నాటి రాయల పేరు నేటికిని తలపోయు
తుంగభద్రానదీ తోయమాలికలందు ॥ఆడవే॥

## 217

పల్లవి : అన్నయ్య సన్నిధి
అదే నాకు పెన్నిధి
కనిపించని దైవమే-ఆ
కనులలోనె ఉన్నది

చరణం : ఒకేతీగ పువ్వులమై
ఒకేగూటి దివ్వెలమై
చీకటిలో వేకువలో
చిరునవ్వుల రేకులలో
కన్నకడుపు చల్లగా
కలిసి మెలిసి ఉన్నాము ॥అన్నయ్య॥

చరణం : కలిమి మనకు కరువైనా
కాలమెంత ఎదురైనా
ఈ బంధం విడిపోదన్నా
ఎన్నెన్ని యుగాలైనా
ఆపదలో ఆనందంలో
నీనీడగ ఉంటానన్నా ॥అన్నయ్య॥

## 218

పల్లవి : ఆనాటి హృదయాల
ఆనందగీతం ఇదేలే ! ఇదేలే !
ఈనాడు నయనాల
విరిసేవసంతం అదేలే ! అదేలే !
ఈపాట అధరాలపైనా
పలికేను ఏనాటికైనా

చరణం : ఏటేటా మనయింటా
ఈ పండుగే జరగాలి
ఈ నిలయం కలకాలం
శ్రీ నిలయమై నిలవాలి
వెలుతురైనా చీకటైనా
విడిపోదు ఈ అనుబంధం ॥ఆనాటి॥

చరణం : తారకలేదిగివచ్చి
తారంగం ఆడాలి
వెన్నెలలే ముంగిటిలో
వేణువులై పాడాలి
ఆటలాగా పాటలాగా
సాగాలి మనజీవితం ॥ఆనాటి॥

---

అన్నదమ్ముల అనుబంధం

# 219

పల్లవి : నా హృదయం నాగార్జున సాగరం
సాగే ప్రతితరంగం అనురాగానికి ప్రతిబింబం

చరణం : గల గల పారే కృష్ణవేణి
తలపులే నాపరుగులు
ఒదిగివున్న ఆ నదీమతల్లి
ఊహలేనా వెలుగులు
నందికొండ శిల్పాలు
నా నిన్నటి రూపాలు
తెలుగువారి కళలదారి
వెలిగించే దీపాలు ||నా హృదయ||

చరణం : పొడి పొడి వోయిన పుడమిగుండెలో
పులకించిన ఈ పైరులు
ఆశలు పండిన రైతుల బ్రతుకుల
వేసిన వెన్నెల దారులు
ఈ నేల అడుగిడగా
నామనసే పరుగిడగా
తేనెపాట మ్రోగింది
తెలుగుతనం పల్లవిగా ||నా హృదయ||

## 220

పల్లవి :

ఆమె : ఈరోజు అన్నయ్య పుట్టినరోజు
మాయింట వెన్నెలలే విరిసినరోజు
తల్లిమనసు మురిసినరోజు
చెల్లి కనులు మెరిసినరోజు

పల్లవి :

ఆమె : ఈ రోజు కన్నయ్య పుట్టిన రోజు
వ్రేపల్లె పువ్వల్లె విచ్చినరోజు
యశోదమ్మ మురిసినరోజు
వసంతాలు కురిసిన రోజు

చరణం :

ఆమె 2 : చీరలదోచిచెలువల నుడికించే
చిలిపివాడే మీ అన్నయ్య

ఆమె 1 : చీరెలనొసగి చెల్లెలి శీలం
నిలిపినవాడే మా అన్నయ్య.

ఆమె 2 : ఆటలు మరిగి అన్నీ మరిచే
అల్లరివాడే మీ అన్నయ్య

ఆమె 1 : తల్లినీ చెల్లినీ ఎన్నడు మరువని
చల్లనివాడే మా అన్నయ్య

---

మొనగాడు

# 221

పల్లవి : ఎవరు ? ఎవరు ? ఎవరురా పెద్దవాళ్ళు !
ఎవరు ? ఎవరు ? ఎవరురా చిన్నవాళ్ళు !
అందరం నేలతల్లి పాపలం ! మన
మందరం ఆ తల్లి చూపులం; చల్లనిచూపులం

చరణం : మర్రిచెట్టు ఎంతఎత్తుపెరిగినా - తాను
పుట్టిన మట్టిని అది మరిచెనా
ఊడలనే చేతులతో మొక్కుతుంది - తన
కన్నతల్లి ఋణం కాస్త తీర్చుకుంటుంది ||ఎవరు||

చరణం : నడుమవచ్చిన సంపదలు ఎన్నాళ్ళు నిలిచేను !
ఏటిలోని నురగలు మరునాటి కేమవును !
కలిమిలేములు జీవితానికి రెండిపక్కలురా
వెలుగునీడలు కాలానికి రెండు రెక్కలురా ||ఎవరు||

చరణం : పుట్టినపుడునేనో బైరాగిని; కానీ
పెట్టిన పేరేమో - రాజనీ
లక్షలున్నా కోట్లున్నా ఎప్పటికి రాజన్ననే - మిమ్మల్ని
పిచ్చిగా ప్రేమించే మీ అన్ననే ||ఎవరు||

## 222

పల్లవి : ఎవరు ముందు పాడినా - ఆ పాట ఒకటే
ఏ గొంతు మీటినా - ఆ రాగమొకటే

చరణం : ఈ యింటి అత్తగారు
మా అమ్మకు మారు పేరు
మా యింటికోడలమ్మ
మహాలక్ష్మి రూపమమ్మ
తీయని మమతల ప్రతిబింబాలు
ఈ యింటి తండ్రికొడుకులు
అందరికీ కనువెలుగు
చిన్నారి మా బాబు - మాబాబు ॥ఎవరు॥

చరణం : ఈ యింటి దీపాలు
ఎప్పుడూ వెలిగేవే
ఈ యింటి తోరణాలు
-ఎప్పుడూ పచ్చనివే
అందరమూ పొందినవరాలు
ఆనంద సౌభాగ్యాలు
ఎన్నెన్నో జన్మలకూ
ఈ బంధం ఉంటే చాలు ·
అదేపదివేలు ! ॥ఎవరు॥

---

హారతి

పల్లవి :-

ఏన్నాళ్ళో వేచిన ఉదయం
ఈనాడే ఎదురౌతుంటే
ఇన్నాళ్ళు దాచిన హృదయం
ఎగిసిఎగిసి పోతుంటే
ఇంకా తెలవారదేమి ?
ఈ చీకటి విడిపోదేమి ?

చరణం :

మంచిని పెంచిన మనిషిని-ఏ
వంచన ఏమీచేయదని
నీతికి నిలబడువానికి-ఏ
నాటికి ఓటమిలేదనీ
నే చదివిన జీవిత పాఠం
నీకే నేర్పాలనివస్తే ||ఇంకా||

చరణం !

నాగులు తిరిగే కోనలో-ఏ
న్యాయం పనికిరాదని
కత్తిని విసిరేవానికి-ఆ
కత్తితోనే గెలవాలని
నేనెరిగిన చేదు నిజం
నీతో చెప్పాలని వస్తే ||ఇంకా||

## 224

పల్లవి :-

పాట పాడనా
పాఠమే నేర్పనా
ఈ పాట ప్రతి యేటా-నీ
ఎదలో మ్రోగాగా !

చరణం :

గలగల పారే సెలయేరులలో
పలికే రాగమే
జిలిబిలి నడకల చిరుగాలులలో
చిలికే నాదమే
లలిత లలితముగ-మధుర మధురముగ
గళములోన సరిమలై పలుకగా ॥పాట॥

చరణం !

రామసుధారస పానముచేసి
రంజిల్లిన త్యాగయ్య
గిరిధర వరగుణ గానముచేసి
తరించి పోయిన మీరా
పలుకు పలుకులో
పదము పదములో
పరవశించి దీవెనలందించగ ॥పాట॥

## 225

సాకీ : ఇనవంశ జలజాత దినకరుడు
సత్యనిరతుడు ధర్మవ్రతుడు భగీరథుడు
గగన గంగనే జగతికి దింపగ
తన ముత్తాతల తరింపచేయగ
తపమొనరించెను ఆనాడు
అదియే నదియై నడిచె ఈనాడు

గంగ : మెచ్చితిని తపమో భగీరథా !
నిశ్చల నిరంతర మనోరథా !
ఇచ్చెదను వరము–దిగి
వచ్చెదను ధరకు–మరి
నను ధరించే యోధుడెవ్వడు ?
నను భరించే నాథు డెవ్వడు ?

భగీరథుడు: "ప్రభో! శూలపాణే! విభో! విశ్వనాథ!
మహదేవ శంభో! మహేశ! త్రినేత్ర!
శివాకాంత! శాంతస్మరా! పురారే!
త్వదన్యో వరేణ్యో నమాన్యోనగణ్యః"
గళమున గరళము ధరించినావే
తలపై గంగను ధరించలేవా!
భవా ! శివా ! శివా !

వ్యాఖ్యానగీతం :

కదిలింది కదిలింది గంగ
కదిలి ఉప్పొంగింది గంగ
పరమరాజ సఖావ పరిజృంభిత నిజాంగ
ఆకాశమే అదరగా-ఐరావతం బెదరగా
నందనవనం ప్రిదులగా-బృందారకులు చెదరగా
సాగింది సాగింది గంగ
సాగి చెలరేగింది గంగ
దూకింది దూకింది గంగ-ఉ
ద్రేకాతిరేకాంతరంగ
హరుని శిరమున పోటులెత్తగా-బ్ర
హ్మాండభాండము బీటలెత్తగా
ఉల్లలత్‌గంగా మహోర్మికావీచికా
కల్లోలధాటి ఒక కంట వీక్షించి
సురగంగ గురువమ్ము విరువంగనెంచి
సంకీర్ణచటుజటాచ్ఛటలనుప్పొంగించి
దుర్గమ్ముగా మలచినాడు-గంగ న
ద్భుతముగా బంధించినాడు
జడయను అడవిని వడివడి అడుగిడి
జాడ ఎరుంగనిదై
తడబడి నడచుచు గడగడ వడకుచు
సుడివడిపోయినదై
ఒకపరియిటుచని ఒకపరియటుచని
మొకమే చెల్లనిదై
అగుపించని ఆ గగనగంగకై
ఆక్రందించె భగీరథుడు-ఆ
మొరవిని సురధుని చెరవిడిపించెను

కరుణాభరణుడు పురహరుడు—...

ఉరికింది ఉరికింది గంగ

ఉన్ముక్త మానసవిహంగ

మునుముందుగా భగీరథుడు నడువంగ

తనమేన సరికొత్త తరగలుప్పొంగ

జలజలాపారుతూ

గలగలాసాగుతూ

చెంగుమని దూకుతూ

చెలరేగి ఆడుతూ

తుళ్ళుతూ తూలుతూ

నిక్కుతూ నీల్గుతూ

ముంచివేసెను-జహ్ను

ముని ఆశ్రమమును

కనలి ఆముని మింగె

గంగాఝరమును

తరలింది తరలింది గంగ-సా

గరుల పాపములు కడుగంగ

సద్గతులను వారికొసగంగ

అల భగీరథుని పేరిలపైన నిలుపంగ

తాను భాగీరథిగా-పుణ్యమొసగే నదిగ



## మీ ఆత్మీయులతో ఆనందం పంచుకోండి
## ఒక్క రూపాయికే నందిని నందుకోండి

కేవలం ఒక్క రూపాయితో – భారత దేశంలో
మీ ఆత్మీయులు ఎక్కడున్నా సరే – సంవత్సరం
పాటు వాళ్ళు మిమ్మల్ని గుర్తుంచుకునేలా – మీ
ఆత్మీయతకు కొత్త అనుబంధాన్ని పెనవేస్తూ –
యువభారతిని వారికి పరిచయం చేసినందుకు
మిమ్మల్ని అభినందించేలా చేస్తూ – పన్నెండు
నెలలూ మీ ఆత్మీయుల్ని పలకరిస్తుంది 'నందిని'
అటు అందుకున్నవారికి ఆనందాన్నీ, ఇటు అంది
స్తున్న మీకు సంతృప్తినీ సమానంగా పంచిపెడ్తుంది–
'నందిని'

**మీరు ఎన్నైనా రూపాయలు పంపవచ్చు**

**అన్ని చిరునామాలూ పంపాలని గుర్తుంచుకోండి!**

ఉత్తర ప్రత్యుత్తరాలకు–

**యువభారతి**

5 కింగ్స్‌వే, సికిందరాబాదు, 500003

స్వయంగా వచ్చి కలవదలిస్తే : యువభారతి కార్యాలయం
ఆంధ్ర సారస్వత పరిషత్ భవనాలు,
తిలక్ రోడ్డు, హైదరాబాదు, 500001



చుట్టూరా
ఆవరించుకునివున్న చీకటిని
తిట్టుకుంటూ కూర్చోవడంకంటె
ప్రయత్నించి
ఎంత చిన్నదీపాన్నయినా
వెలిగించడం మంచిది
అన్న వాక్యమే మా యువభారతికి ఊపి